# ఇతడే ఆ మహా మనీషి

భారత భూమిని
భారత ప్రజలను నిండు
హృదయంతో ప్రేమించిన వ్యక్తి
దానికి ప్రతిగా ప్రతి భారతీయుడు
వారిని నిండు మనసుతో
ఆరాధించారు.



అనాథులకు, అభాగ్యులకు
ఆపదవేళలో ఆక్రోశించే
అనేకులకు పెన్నిధికి
ప్రతిరూపంగా నిలిచారు.





"దేశ జనాభాలో సగంగా ఉన్న
మన స్త్రీ జాతి వెనకబడిపోతే
దేశ ప్రగతికి మార్గమెక్కడ?
అని ప్రశ్నించి
భారతదేశ స్త్రీ జనోద్ధరణకు
అనవరతం కృషి చేసారు.



"నిరంతరం కృషి చేస్తూ.
విజయ సాధనే లక్ష్యంగా
పెట్టుకున్న వ్యక్తులే
నాకు కావాలి"



భారతదేశ నిర్మాణమే వారి ఏకైక లక్ష్యం

JAGATI Rs. 3-00 December 1989

35th Year of Publication




## నెహ్రూ శత జయంతి - 1989

### నెహ్రూవాణి

JAG ష దౌర్జన్యభావాలు మననెప్పుడూ నీరస పరుస్తాయి.

యుధ బలాలు ఈ ప్రపంచ సమస్యలు వేటినీ పరిష్కరించలేవు.

క్కులు ఎప్పుడూ గుర్తువుంటాయి; బాధ్యతలే తరుచూ మరిచిపోతారు.

సా పద్ధతి ఎన్నుకొనేవారికి ప్రజాస్వామ్య విధానంలో విశ్వాసం లని తీర్పు చెప్పవలసి ఉంటుంది.

రాలు మూసి వేయబడ్డ సమాజంలో జీవించడం హానికరం. శుభ్ర గాలి, నూతన భావాలు లేకపోతే మనం పాలిపోతాం - సమాజమూ తే.

నర నారీ జనానికి రాకపోకలు వున్నాయి: కాని, జాతి అనేది చిరంజీవి, అందులో అమరత్వం ఉంది.

కాలాను గుణంగా హేతు ప్రమాణంతో మార్పుని అంగీకరించకపోతే, ఒక ఉప్పెన ఉద్భవించి సమస్తం తలకిందులు చేస్తుంది.

ఆగ్రహంతోను, అహంభావంతోను చేసే పని వ్యక్తికి హానికరమని అందరికీ తెలుసు; దేశానికి మరింకెంత హానికరమో అంచనా కట్టి చెప్పలేము.

విజేత తను జయించిన ప్రజలోని ప్రతిఘటనని రూపుమాపి పాదాక్రాంతం గావించకొనేందుకు జరిపే ఘాతుక చర్యలకు హింసాకాండకు మతం కారణమనుకోవడం శుద్ధ మూర్ఖత్వం.

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్: 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు 100-00. జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.-100-00

ముఖచిత్రం: పండిట్ నెహ్రూ

పాతికేళ్ల క్రితం పన్నెండుకోణాల నుంచి

# పండిట్ నెహ్రూ

ప్రజాస్వామ్యానికి ప్రాణంపోసి, ప్రపంచశాంతే భారతీయుల ప్రగాఢవాంఛ అని సర్వమానవాళికి పలుమార్లు తెలిపిన ఈ మహనీయుడు ప్రణాళికాబద్ధంగా పయనించడమే ప్రగతి పథ మని భావించారు. నెహ్రూగారు అవలంబించిన విధానాలు ఒక వ్యక్తి యిష్టానిష్టాలకు చెందినవి కావు. వాటి వెనక ఒక జాతి జీవస్పందన వున్నదనే చాలా మంది విమర్శకులు విస్మ రిస్తూంటారు. బహుముఖ ప్రజ్ఞానిధి అయిన నెహ్రూజీని విభిన్న కోణాలనుంచి వీక్షించగల అవకాశమే ఈ వ్యాస పరంపర.

## నవ భారత నిర్మాత

నెహ్రూ రాజకీయ చరిత్ర వ్రాసిన ఒక రచయిత 1956 లో, అంటే ఆయన దివంగతులు కావడానికి ఎనిమిదేండ్లకు ముందు ఆయన్ని ఒక ప్రశ్న అడిగారు. దేశంలో సోషలిస్టు ప్రజాసామ్య ప్రభుత్వం, మతాతీత ప్రభుత్వ వ్యవస్థ, వ్యవహారాలలో అలీన విధానం - ఈ ముఖ్య విధా నాలు ఆయన తర్వాత కూడా కొన సాగేందుకు ఎలాటి ఏర్పాట్లు చేశారని అడిగారు. అందుకు నెహ్రూ ఇలా అన్నారు :

'ఇందుకు సమాధానం చెప్పడం కష్టమే. కాని, నేను ప్రోత్సహించి ప్రచారం చేసిన ఈ విధానాలు కేవలం ఒక వ్యక్తి సృష్టించినవికావని మాత్రం ముందుగా చెప్పాలి. వీటిని గాఢంగా విశ్వసించే వారు చాలా మందే ఉన్నారు. అంతకన్న ఇంకో విశేషం కూడా ఉంది. ఈ విధానాలకు దేశంలో అశేష ప్రజాబాహుళ్యం మద్దతు ఉంది. క్రమ క్రమముగా అమలుపరిస్తే ప్రగతి పథంలో కొంత దూరం సాగినట్లు అవుతుంది. అప్పు డింక వెనుకంజ వెయ్యడానికి వీలు పడదు. ప్రజలకు సంబంధించినంత వరకు నా బాధ్యత ఏమిటంటే ఆయా విషయాలు వారికి అర్థమయ్యేటట్లు సులభమైన భాషలో వివరించడం. ఇక మిగతా సంగతులు : చెయ్యగలిగి నంత చెయ్యడమే మనవంతు. భవి ష్యత్తును గురించి అట్టే బెంగపెట్టుకో కూడదు''.... నిద్రాణమై ఉన్న భారత జాతిని మేల్కొల్పి ప్రజలలో ఒక నవ

చైతన్యం కలిగించారు గాంధీ మహాత్ముడు. అటువంటి ఖ్యాతి ఆయనకు దక్కితే, ప్రజలను ప్రగతి పథంలో ముందుకు నడిపించడమే కాకుండా, స్వయముగా ప్రగతి మార్గాన్ని గుర్తించే వికాసాన్ని వారికి కలిగించినఖ్యాతి నెహ్రూకు దక్కింది.

ఇది రెండు విధాలా ప్రయోజన కారి అయ్యింది. ఒక వంక సాంఘిక, ఆర్థిక, అంతర్జాతీయ రంగాలలో నెహ్రూ విధానాలు ముమ్ముందు కూడా అనుసరింపబడేలా చెయ్యడం జరిగింది. మరొకవంక ప్రజలే ఇందుకు పూచీ పడేలా చెయ్యడం జరిగింది. ఫలితంగా ఈ విధానాలు అమలు పరచడంలో ప్రజలే భాగస్వాము లయ్యారు.

నెహ్రూ ప్రజలలో నవతా జ్యోతి వెలుగందుకొనేలా చేశారు. వారికి కార్యదీక్ష అలవరిచారు. వారికి ఉన్న తాశయాలు, ఆశలు కల్పించారు. దృఢ సంకల్పంతో అచంచల విశ్వా సంతో ఆ లక్ష్యాలూ ఆదర్శాలూ సాధించడానికి మార్గం కూడా ఆయన సూచించారు. తత్త్వవేత్త, మార్గదర్శ కుడు, ఆదర్శ విప్లవవాది కావడమే కాకుండా నెహ్రూ భారత దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థకు రూపుదిద్దిన మహనీయుడు. భారతదేశానికి ఆయన విడిచి పెట్టిన వారసత్వంలో పరిపూర్ణ ప్రజాస్వామ్య వికాశం మహత్తరమైన దని కొందరి భావన. సోషలిస్టు సిద్ధాంతం పట్ల, ఆయనకు ప్రగాఢ మైన విశ్వాసం ఉన్నప్పటికీ, వ్యక్తి ప్రాధాన్యం కూడా ఆయన సమంగానే గుర్తించారు.

## ప్రజాస్వామికం

సమతకు స్థానంలేని సాంఘిక వ్యవస్థ ప్రకృతి విరుద్ధమైనది. అది కాల క్రమాన పతనం చెందక తప్పదు. భారత దేశ సాంఘిక చరిత్రను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్న పండిట్ నెహ్రూ వెనకెప్పుడో అన్నారు; 'సుస్థి రమైన సాంఘిక వ్యవస్థను రూపొందిం చడంలో భారత దేశం ఎంతటి ఘన విజయాన్ని సాధించిందో, సంఘ శ్రేయస్సుకు ప్రాణప్రదమైన 'సమ త్వాన్ని' అంతఘనంగా నిర్లక్ష్యం చేసింది. అందుకే పతనావస్థ పొందింది.'

సమత్వం సాంఘిక న్యాయం. సాంఘిక భద్రతలతో కూడిన సాంఘిక వ్యవస్థను సృష్టించాలనే దృష్టి ఆయనది. సమాజ పరిణామసిద్ధాం తాన్ని రూపొందించారు. ఆ వ్యవస్థ వ్యక్తిగత లాభాపేక్ష, దురాశ మొద లైన వ్యామోహాలకు, అతీతమైనదీ, రాజకీయ అధికారం ఆర్థిక సంపద లను న్యాయబద్ధంగా పంపిణీచేసే అవ కాశాన్ని కల్పించేదిగా ఉండాలని ఆయన లక్ష్యం. ప్రజాస్వామిక పద్ధతిలో, శాంతియుత మార్గాల ద్వారా, ప్రజలందరికీ సమానావకా శాలుగల, వర్గరహితమైన సమాజాన్ని సృష్టించాలన్నదే ఆయన సిద్ధాంత పరమలక్ష్యం.

ఈ వర్గరహిత సమాజ స్థాపనకు సోపానాలుగా రెండు ముఖ్య సిద్ధాంతాలను ఆయన ప్రవచించారు. ఒకటి ప్రజాస్వామ్యం, రెండువది సోషలిజం. ఈ రెండింటి మేలు కలయికే 'ప్రజాస్వామిక సామ్యవాదం' లేక 'సామ్యవాద ప్రజాస్వామ్యం' లేక 'ఆర్థిక ప్రజాస్వామ్యం'-హింసా విధానంతో కూడిన నియంతృత్వం ద్వారాగాక ప్రజాస్వామ్యం వర్ధిల్లడం ద్వారానే మన దేశంలో సోషలిజమ్‌ను స్థాపించాలి. ప్రజాస్వామిక వ్యవస్థలో వుండే లాంఛన ప్రాయమైన సమానత, సోషలిస్టు వ్యవస్థలో సిసలైన సమాజంగా మార్పు చెందినప్పుడే, 'ప్రజాస్వామిక సోషలిజం' సార్థక మౌతుంది.

నెహ్రూ గ్రంథాలలోనూ, ప్రసంగాలలోనూ 'శ్రేయోరాజ్యాన్ని' గురించిన ప్రస్తావనలు విస్తారంగా కనపడతాయి. నెహ్రూ కలలుగన్న శ్రేయో రాజ్య సిద్ధాంతాలకూ, పెట్టుబడి దారీ వ్యవస్థకు లోబడిన శ్రేయోరాజ్య సిద్ధాంతాలకూ. విపరీతమైన తేడా వుంది. 'దమన నీతి తాండవించే రాజ్యం' కంటే శ్రేయోరాజ్యం అన్ని విధాలా శ్రేయస్కరమైనది. అయితే పెట్టుబడి దారీ వ్యవస్థ ఏర్పర్చే 'శ్రేయోరాజ్యం సోషలిస్టు వ్యవస్థ నెలకొల్పే 'శ్రేయో రాజ్యం' ఒకటే నంటే, ఆర్థిక సూత్రాల రీత్యా అంతకంటె పొరబాటు మరొకటి లేదు. మానవతా వాదాన్ని ఆచరణలో పెట్టడమే సామ్యవాదం అని నెహ్రూ సిద్ధాంతం. మానవత మరిచిననాడు మానవునిలోని సృజనాత్మక శక్తులు, భవిష్యత్తులో ఎట్టి ప్రమాదము వుండదన్న ధీమాతో, సృజనాత్మక కార్య రూపాలకు వినియోగపడగలవు.

—రఘునాథ రెడ్డి
పార్లమెంటు సభ్యులు

---

## ప్రజాస్వామ్యవాది

నవభారత నిర్మాణంలో నెహ్రూ నిర్వహించిన పాత్ర అపూర్వమైనది. సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి ఆయన చేసిన కృషి అత్యంత ప్రశంసనీయమైనది. భారతీయ సాంఘిక వ్యవస్థను సోషలిస్టు పద్ధతిలో పునర్నిర్మిస్తేతప్ప దేశంలో ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక అభ్యున్నతి సాధించడం శక్యం కాదని విశ్వసించడం మూలంగానే ఆయనకు ఇటువంటి నూతన దృక్పథం ఏర్పడింది.

నెహ్రూ, గాంధీ మహాత్మునితో అత్యంత సన్నిహితమైన సాహచర్యంవల్ల ప్రభావితులయ్యారు. సాంఘికపరిణామ సాధనలో వర్గ పోరాటం, వైషమ్యాల కంటె ప్రేమ, సామరస్యం, అహింస అత్యంత ఉత్తమ సాధనలని ఋజువు కావడంవల్ల కూడా ఆయన కొంత ప్రభావితులయ్యారు. స్వతంత్ర భారత దేశంలో సామ్యవాద పద్ధతి ఒక నూతన జీవన విధానముగా రూపొందడం వాంఛనీయమని ఆయన ఆశించారు. ఆయన దృష్టిలో సామ్యవాదం కేవలం ప్రజలందరికీ సమానమైన అవకాశాలు కల్పించడానికీ, ఆదాయము, సంపద విషయంలో అసమాన



*'The woods are lovely, dark and deep,*
*But I have promises to keep,*
*And miles to go before I sleep*
*And miles to go before I sleep'*

*—Robert Frost*



తలను సాధ్యమైన మేరకు తొలగించ డానికి, ఆర్థిక సంపద యావత్తూ కొద్ది మంది చేతుల్లోకి పోకుండా నివారించేందుకు మాత్రమే ఉపయుక్తమయ్యేది కాదు. సోషలిజమ్ విషయంలో ఆయన ఆశయాలు అంతకంటె ఉన్నతమైనవి. ప్రణాళికా బద్ధంగా ఆర్థికాభివృద్ధి సాధించవలసి ఉన్నదనీ, దేశంలో ప్రజల దారిద్ర్యాన్ని నిర్మూలించడానికి, ఆర్థికాభివృద్ధి కుంటు పడకుండా నివారించేందుకూ ఇది ఒక్కటే మార్గమనీ అన్నారు. వివిధ రంగాలలో ఉత్పత్తి శక్తి పెంపొందింప చెయ్యడానికి ఆదాయము పెట్టుబడులుబాగా పెంచవలసి ఉన్నదని ఆయనగుర్తించారు. ఇందుకు సోషలిస్టు పద్ధతిలో సాంఘిక వ్యవస్థ నిర్మించేందుకు ప్రభుత్వం పూనుకోక తప్పదనీ, వివిధ రంగాలలో క్రమాభివృద్ధి సాధించాలనీ ఆయన అభిప్రాయ పడ్డారు. ఆయన ప్రణాళికారచన, ఆర్థికాభివృద్ధి సోషలిస్టు పద్ధతిలో సాంఘిక వ్యవస్థ నిర్మాణం - ఈ మూడింటికి సమాన ప్రాధాన్యం కల్పించారు. ఇవి ఒక దానితో ఒకటిముడిపడి వున్నాయి. ఆర్థికాభివృద్ధి లేనిదే సోషలిజమ్ ఉండదు. ప్రణాళికాబద్ధం కాకపోతే ఆర్థికాభి వృద్ధి జరగదు. సోషలిజమ్ లేకుంటే ప్రణాళికా రచనే ఉండదు. అందువల్లనే మన ప్రణాళికలను ఈ మూడు అంశాలకు సరియైన ప్రాధాన్యం ఇచ్చి రచించడం జరిగింది. నెహ్రూ సిద్ధాంతాల ప్రభావం వీటిపై స్పష్టంగా కన్పిస్తుంది.—డా॥ వి కె ఆర్ వి రావు

ప్రముఖ ఆర్థికవేత

# ఆర్థిక విధానం

రతదేశ గత 17 సం॥లలో అను సరించిన ఆర్థికవిధానాలను గురించి విమర్శలు వినవస్తున్నాయి. ప్లానింగ్ విధానంలోని లోపాలు, దేశ ఆర్థిక సంస్థకు సంబంధించిన నెహ్రూ విధానాలు ప్రస్తుత ఇక్కట్లకు మూల కారణాలని కూడా అంటున్నారు. ఈనాడు ఆర్థిక సంక్షోభముతో, బాధపడుతున్న సంగతి నిజమే. ప్రస్తుత ఆర్థిక ఇబ్బందులు లోగడ విధానాల ఫలితమా, లేక కొన్ని పరిస్థితుల ఫలితంగా, ప్రస్తుత ఆర్థిక విధానం మినహాగా మార్గాంతరం లేకపోయిందా అన్న విషయాన్ని ప్రతి భారత పౌరుడూ నిశితంగా పరిశీలించి ఆకళింపు చేసుకోవాలి.

లోగడ నుంచి ఆర్థిక విధానాలను విమర్శించటమంటే పండిట్ నెహ్రూ భావుకతనూ, దూరదృష్టినీ విమర్శించడమన్నమాట. పండిట్‌జీ అమలు జరిపిన విధానాలలోని సహేతుకతను నిరూపించడము నా పవిత్ర ధర్మంగా భావిస్తున్నాను. పండిట్ నెహ్రూ ఒక్క ప్రధానమంత్రే కాదు; ఆయన మహానాయకుడు. భారత జాతీయత ఆయనలో మూర్తీభవించివున్నది. ప్రజలదారిద్ర్యాన్ని నిరక్షరాస్యతనూ తొలగించడానికి తోడ్పడాలంటే అభివృద్ధి కృషి ప్రణాళికాబద్ధంగా కొనసాగించి, సోషలిస్టు సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి కృషి చెయాలన్నదే ఆయన లక్ష్యం.

ఇనుము, ఉక్కు, ఇనుము కలియని లోహాలు. బొగ్గు సిమెంటు, భారీ రసాయనికాలు మొదలైన పరిశ్రమలను చెప్పుకోదగినంతగా అభివృద్ధి చేయడం అవసరమైనది. వీటితో పాటు వాడకందార్ల పరిశ్రమలు, గ్రామ పరిశ్రమలు కూడా అభివృద్ధి చేయ బడుతున్నాయి.

మన ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ ప్రధానమైనది కనుక, పంటల దిగుబడులనుబట్టి సరుకుల ధరలు మారుతూ వుంటాయి. మొదటి ప్రణాళికా కాలంలో ధరలు విపరీతంగా పడిపోవడము, రెండవ ప్రణాళికా కాలంలోనూ, మూడవ ప్రణాళికా కాలంలోనూ ధరలు పెరిగే ధోరణి వ్యక్తమవటము కూడా పంటలలో మార్పులను బట్టి జరిగినవే.

1950 లగాయతు 1964 మే నెలలో ఆ మహానాయకుడు అస్తమించే వరకూ, ధర వరల సూచి, 40 పాయింట్లు పెరిగింది. అంటే సంవత్సరానికి మూడు పాయింట్లు చొప్పున మాత్రమే ధరలు పెరిగాయన్నమాట.

రకరకాల కంట్రోళ్ళను తెచ్చిపెట్టి శ్రీ నెహ్రూ, దేశంలో పరిశ్రమల వ్యాప్తిని ఆటంకపరిచారన్న విమర్శ ఒకటి ఉన్నది. అయితే దీనివల్ల వ్యా మయ్యేది ఒక్కటే. ఆ విమర్శించేవారు కంట్రోళ్ళవిధింపుకు దారి తీసిన పరిస్థితులనూ, కంట్రోళ్ళద్వారా సాధించ







దలచిన ఫలితాలనూ, సరిగా బోధ పరచుకో లేక పోయినారు అనేది. అన్యాయానికీ, అక్రమానికి వెరవని వ్యక్తులు చాలామంది దేశంలో ఏర్ప డిన కారణాన, పరిస్థితిని అవకాశంగా తీసుకొని బాగుపడేందుకు ఈకంట్రోళ్ళు అడ్డువచ్చాయను కొనుమారే, కంట్రోళ్ళు ప్రణాళికా బద్ధంగా శ్రేయోభివృద్ధి సాధనకు పూనుకున్నప్పుడు, పెరిగె రాబడులకీ, ఆ సొమ్ము ఖర్చుచేసేందు కనువైన సరుకులు లభ్యమవడానికీ మధ్య ఎప్పుడూ, కొంత అంతరం ఉంటుందన్న సంగతి గుర్తుంచు కోవాలి. అంటే అవసరాన్ని బట్టి కం ట్రోళ్ళకూ, సరుకు కేటాయింపులకూ మనం సిద్ధపడవలసి వస్తుందన్నమాట. అయితే ఈ రెంటినీ చక్కగా సంఘటిత పరచినప్పుడే పని సరిగా జరుగుతుంది. చాలినంతగా లభ్యముకాని మన సాధన సంపత్తి వీలైనంత హెచ్చుగా ఫల ప్రదముగా ఉపయోగ పడేందుకు కంట్రోళ్ళు అవసరమవుతాయ్. కేవ లము అదేదో ఒక విధానంగా చెప్పు కునేందుకు, కంట్రోళ్ళు ఉండాలని శ్రీ నెహ్రూ ఎన్నడూ అనలేదు.

దేశ ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వం ప్రముఖపాత్ర వహించ గలిగినప్పుడే జన బాహుళ్యము అన్యాయాలకు గురి కావడము తప్పిపోతుంది. ప్రణాళికే బద్ధమయిన ఆర్థిక వ్యవస్థను మనము నమ్ముకోవలసి ఉంటుంది.. హెచ్చుగా అసాధారణ పరిస్థితుల మూలముగా ఆర్థిక వ్యవస్థ కొన్ని ఒత్తిడులకు గురి అయినంత మాత్రాన మన జాతీయ విధానాలు లోపభూయిష్టమయినవని అర్థము కాదు.

—ఎల్లెన్ మిశ్రా
కేంద్ర ఆర్థిక ఉపమంత్రి



## విదేశాంగ విధానం

ఒక పుష్కరం వెనుకటి స్మృతు లవి. ప్రకృతి రమణీయంగా వుండే జూన్ నెల. సాయంసమయం. జవహర్ లాల్ నెహ్రూ గౌరవార్థం క్రెమ్లిన్‌లో విందు జరుగుతోంది. భారత, సోవి యట్ దేశాలమైత్రి కలకాలం వర్థి ల్లాలని సోవియట్ ప్రధాని అన్నారు: "మా రష్యన్లలో స్నేహం అంటూ ఏర్పడితే ఆమరణాంతరం స్నేహి తులుగానే వుండాలి. విరోధం ఏర్ప డినా అంతే. ఉభయ దేశాల మధ్యా నెలకొన్న స్నేహానుబంధాలపట్ల హర్షం వ్యక్తబరుస్తూ, 'మాకు అసలు శత్రువు అనే వారేలేరు' అన్నారు జవహర్ లాల్.

ఆనాటి నెహ్రూ మాటలు యీనాడు ఎంత వింతగా ధ్వనిస్తాయి! అక్సాయ్ చిన్, కచ్‌రాణ్ సంఘటనలూ, మెక్ మోహన్ శ్రేణిపై సైనిక సమీకరణ వీటిని ఇప్పుడు గమనిస్తే, భారతదేశా నికి శత్రువులు లేరని ఎవరూ అన లేరు. నెహ్రూ అలీనవిధానం ఫలిత మిదేనా అనిపిస్తుంది.

నిజానికి, అలీన విధానము నెహ్రూ విశిష్టత వల్లనే రూపొందినది. మన జాతీయ జీవనంలో ప్రతీ అంశంపైనా నెహ్రూ వ్యక్తిత్వపు ఛాయలు పడ్డాయి.

కాని, విధేశాంగవిధానంపై ఆయన ప్రభావం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆయన అధికారాన్ని చేబట్టినప్పుడు భారతదేశానికి సొంత విదేశాంగ విధానుమంటూ లేదు. ఆ మాటకొస్తే, అనేక శతాబ్దాలుగా. భారత దేశానికి సొంత విదేశాంగ విధానమంటూ లేనే లేదు. బ్రిటిష పాలనలో, భారతదేశపు అంతర్జాతీయ సంబంధాలు వైట్‌హాలు (బ్రిటిష్ ప్రభుత్వ కార్యాలయం) లోనే నిర్ణయించబడేవి. ఆఫ్ఘనిస్తాన్, నేపాలు, టిబెట్ సరిహద్దు దేశాలతో బ్రిటిష్ పాలకుల వ్యవహారాలు భారత ప్రభుత్వ విదేశ, రాజకీయ శాఖ ద్వారా జరిగేవి. దలైలా మాకుగానీ, ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వానికిగానీ, నేపాలుకుగానీ లేదా చివరకు కలాల్ ఖాన్‌కుగానీ భారత ప్రభుత్వం వ్రాసే లేఖలన్నిటికీ లండన్ లోని ఇండియా కార్యాలయం ఆమోదము ద్రవుండవలసిందే, బ్రిటిష్ పాలన చివరి రోజుల్లో, అంతరంగిక వ్యవహారాల లో భారతదేశానికి కొంత వరకూ స్వయం నిర్ణయాధికారం వుండేది. కాని, అంతర్జాతీయ రంగంలో భారత దేశానికి స్వతంత్రవిధానమే లేదు.

ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం భారతదేశానికి స్వాతంత్ర్యం సిదించింది. అప్పటి ప్రపంచ పరిస్థితి ఎలా వుంది? అమెరికా, రష్యాలు రెండూ బలవత్తరమై రాజ్యా లయినాయి. తమ జీవిత విధానమే సరియైన జీవిత విధానమని వాటి దృఢవిశ్వాసం. ప్రచారం ద్వారానేమి, విద్రోహచర్యల ద్వారానేమి లేదా యుద్ధం ద్వారా, నేమి, ప్రపంచ దేశాలపై తమతమ ప్రాబల్యాన్ని పెంపొందించుకోవాలనీ ప్రత్యర్థి కూటమి ఆటకట్టించాలని కృతనిశ్చయంతో వుండేవి. ఒకటి ఉత్తర - అట్లాంటిక్ సైనికకూటమి, ఆగ్నేయాసియా సైనికకూటమి, మధ్య దేశాల సైనికకూటములను ఏర్పరచుకుంటే, రెండోదివార్సా సైనిక కూటమి ఏర్పరచుకుంది.

అప్పుడు భారతదేశం సైనికంగా బలహీనంగాఉంది. ఆర్థికముగా వెనుకబడివుంది. అట్టిపరిస్థితిలో వున్న భారతదేశం ఏదో ఒక రాజ్యకూటమిని అంటి పెట్టుకునివుంటే, ఆ రాజ్య కూటమి చేతిలో భారతదేశం కీలు బొమ్మ అవుతుందని నెహ్రూ ఒకసారి అన్నారు. అమెరికా వేగుల విమానం (యు-2) పాకిస్తానులో పెషావరు నుంచే కదా సోవియట్ రష్యాకు వెళ్లినది. దానితోనే, పారిస్‌లో జరగవలసిన అధినాయక సమావేశం భగ్నమయింది. ప్రపంచములో శాంతి కర్షకుడుగా ఖ్యాతి గడించాలని ఆశలు పెట్టుకొన్న అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హెూవర్ ఆశలను ఛిన్నాభిన్నం చేసింది.

భారతదేశం ఏ రాజ్యకూటమి లోనూ చేరకుండా వున్నందుకు జాతీయాభిమానమూ, ఆత్మగౌరవమే కాదు కారణం. 1946 సెప్టెంబరులో తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన తరువాత జరిగిన

మొట్టమొదటి పత్రికా విలేఖరుల గోష్ఠిలో నెహ్రూ యిలా ప్రకటించారు:

"పూర్వం ప్రపంచయుద్ధాలకు దారి తీసిన రాజకీయాలు, రాజ్య వర్గాల కక్షలకు మేము వీలైనంత వరకూ దూరంగా వుండదలిచాం. ఇటువంటి రాజకీయాలు ముమ్ముందు మరింత విధ్వంసకరమైన యుద్ధాలకు దారితీయ వచ్చు. ప్రపంచంలో పైన ఎన్ని తగాదాలు, సంఘర్షణలూ, పరస్పర ద్వేషాలూ వున్నప్పటికీ, క్రమంగా సన్నిహిత సహకారానికీ సామరస్యానికీ ప్రపంచం ముందుకు సాగుతూనే వుంటుంది. భారత దేశం ఇటువంటి ప్రపంచ ఐక్యత కోసం కృషి చేస్తుంది. అంతర్జాతీయవ్యవహారాలలో అత్యంత ప్రధాన పాత్రనిర్వహించవలసిన బాధ్యత, దైవికంగా పైనబడిన అమెరికా ప్రజలకు శుభసందేశం మనం అందజేస్తున్నాం. ప్రపంచ వ్యవహారాల లో పెద్ద బాధ్యత నిర్వహిస్తున్న మరొక ఆధునిక రాజ్యమైన సోవియట్ యూనియన్‌కు కూడ మన శుభ సందేశం అందజేస్తున్నాం."

స్థూలముగా పరిశీలిస్తే చాలా నాగరిక దేశాలలో వాస్తవిక వాదుల వర్గము, మరొక వంక ఆదర్శవాదుల వర్గం ఇలా రెండు వర్గాలూ ఉంటూ వచ్చాయి. భారతదేశంలో కూడా ఇటు వంటి రెండు వర్గాలు ఉండేవి. కౌటిల్యుని రాజనీతి శిరోధార్యమని భావించే వారు మొదటివర్గం అయితే, అశోకుని ధర్మప్రబోధాలకు అనుగుణంగా శాంతి,

అహింస ధర్మ నిష్ఠ అనుసరణీయమని భావించే వారు రెండవవర్గం. నెహ్రూ పాశ్చాత్య దేశాలలో విద్యాధ్యయనం చేసి వచ్చినా రాజకీయ వేత్తగా పెరిగి పెద్ద వారైంది గాంధీ మహాత్ముని ప్రభావం తోనే. గౌతమబుద్ధుని ప్రభోధాల మూలంగా ప్రభావితుడైన మహనీయుడు అశోకచక్రవర్తి. ఆయన ఆదర్శాలను అధునిక యుగంలో నెహ్రూ అభిమానించడం జరిగింది. అందువల్లనే ఉత్తమ ఆదర్శాలను సాధించడానికి దుష్ట సాధనోపాయాలు పనికిరావనీ, ధర్మబద్ధమైన కృషి మూలంగా సత్ఫలితాలు కలుగుతాయనీ నెహ్రూ విశ్వసించడం జరిగింది. ప్రపంచ చరిత్ర క్షుణ్ణముగా తెలిసిన వాడు కావడంచేత, ఇరుగుపొరుగు దేశాల మధ్య రకరకాల శత్రుత్వం సాగితే, ప్రజలు ఎంత దీర్ఘకాలం ఎటువంటి కష్ట నష్టాలకు గురి అవుతారో ఆయనకు స్పష్టంగా తెలుసు. మన సరిహద్దును ఆనుకొని ఉన్న దేశం మనకు దేశశత్రుమేనని కౌటిల్యుని నిర్వచనం. కాని నెహ్రూ ఈ పద్ధతి అవలంభించలేదు. కౌటిల్యుని నిర్వచనం సరియైనదని భావించి ఉంటే ఆయన మొదటినుంచీ చైనాను శత్రువుగా పరిగణించే వారే, కాని ఆయన అలా పరిగణించ లేదు. ఫ్రాన్సు, జర్మనీల మధ్య శతాబ్దాల తరబడి సాగిన శత్రుత్వంవంటిది. ఇండియా చైనాల మధ్య ఏర్పడకుండా నివారించ గలిగారు. ఫ్రాన్సు. జర్మనీల మధ్య ఏర్పడిన విరోధం అనేక యుద్ధాలకు. చివరకు. రెండు ప్రపంచ మహా సంగ్రామాలకు దారి తీసింది. ఈ రెండు దేశాల మధ్య ఏర్పడిన శత్రుత్వం మూలంగా మొత్తం ఐరోపా చరిత్ర కలుషితమై పోయింది.

ఆయా విషయాలు సమగ్రముగా పరిశీలించిన మీదట మన విదేశాంగ విధానంలో ఆశావాదంపాలు కొంచెం ఎక్కువ ఉన్నదనీ. పూర్తిగా ఫలప్రదము కాగలదనీ మనము ఎక్కువగా ఆశలు పెట్టుకోవడం జరిగిందనీ అంగీకరించవలసి వస్తున్నది. మనం కూడా తప్పకుండా అలీన విధానానికి కట్టుబడిఉంటే. దురాక్రమణ సంభంచదని ఆశించాం. రష్యాతో స్నేహ సంబంధాలు దృఢతరం చేసుకోవడంలో అలీన విధానం ఎంతగానో ఉపకరించడం మూలంగా ఇతర దేశాలు కూడా మన విధానాన్ని అదే విధమైన సమరస దృష్టిలో అవగాహన చేసుకొంటాయని ఆశించాం. అంతేకాదు, బలవంతుదే రాజ్యంఅన్న వింత వాదానికి అంతర్జాతీయ వ్యవహారాలలో ఇప్పటికీ ఇంకా. స్థానం ఉంటుదన్న విషయం మనం సమంగా గుర్తించలేదు. మనిషికీ మనిషికీ మధ్య ఒకేఒక సమస్య ఉన్నది. అదేమంటే ఎవరు బలవంతులో తేల్చుకోవడమే కార్లయిల్ ఒక గ్రంధంలో వ్రాశారు. ఇది రాతియుగం నాటి అనారిగక సమాజంలో చెల్లుబాటయితే కావచ్చు. కాని నేటి పరిస్థితులలో ఇది చెల్లుబాటు కాదు.

ఇదేవిధముగా వివిధ దేశాల మధ్య నాగరిక వ్యవస్థ నెలకొని శాంతి సామరస్యాలు విరస్థాయి కావడానికి తోడ్పడ గల ప్రపంచ వ్యవస్థ ఇంకా రూపొంద లేదు. యునైటెడ్ నేషన్స్ ద్వారా ఇటువంటి కృషి స్వల్పంగానైనా ప్రారంభమైంది. శాంతి భద్రతలకు ఎక్కడ భంగం కలిగినా పరిస్థితిని అదుపులోనికి తీసుకొని రావడానికి యునైటెడ్ నేషన్స్‌తో భారతదేశం సంపూర్ణంగా సహకరిస్తున్నది.

—కెపిఎస్ మీనన్

దౌత్యనిపుణులు



## సోషలిస్టు వ్యవస్థ

నెహ్రూ మానవతా దృక్పథంలో, మత ప్రమేయంలేని దృక్పథంలో ఒక భాగం. మానవుని పట్ల ఆయనకు అకుంఠిత విశ్వాసం వున్నది. సామాన్య ప్రజల స్థితిగతులను మెరుగు పరచడానికి, వారి మూఢ విశ్వాసాలను తొలగించడానకి, ప్రతి ఒక్కరికి సమానావకాశాలుండే నూతన వ్యవస్థను నిర్మించడానికి, ప్రజలందరికి కనీస జీవన వ్యయ ప్రమాణాలను కల్పించడమే నెహ్రూజీ లక్ష్యం.

మతాతీత దృక్పథం లేనిదే, భారత దేశానికి రాజకీయంగా భవిష్యత్తులేదని ఆయన గుర్తించారు. అందరికీ పౌరసత్వపు హక్కు, ఆరాధనా స్వాతంత్ర్యం, అభివృద్ధి చెందడానికి అందరికీ సమానావకాశాలు, అన్న సుత్రాలే ఆయన తత్వంలో ముఖ్యాంశాలు. చరిత్ర అంటే ఏవిటో ఆయనకు క్షుణ్ణముగా తెలుసు. పౌరసత్వానికీ, మతానికీ ఎట్టి సంబధం లేదనీ శాతాబ్దాలుగా భారతదేశంలో అనేక మతాల వారు పౌరసత్వం కలిగివున్నారనీ, మాతృభూమికి వారందరూ విధేయులై వుండేవారనీ ఆయన గుర్తించారు.

గాంధీజీ, నెహ్రూలిద్దరూ మతాతీత సిద్ధాంతమందు విశ్వాసమున్నవారే. అయితే, వారి దృక్పధాలు వేరు. గాంధీజీ పూర్తిగా మతంపట్ల భక్తిగల వారు: అన్నిమతాలు ఈశ్వర సాక్షాత్కారమన్న లక్ష్య సాధనకు భిన్న భిన్న మార్గాలని ఆయన విశ్వాసం. మతాతీత ప్రజారాజ్య సిద్ధాంతం రాజకీయంగా నూరి, అధ్యాత్మికంగాను, మహోన్నత ఆశయమని నెహ్రూ విశ్వాసము. ఒక్క భారతదేశమే గాక, ప్రపంచంలోని అన్ని దేశాలూ, ఏనాటికైనా, బహుజాతి, బహుభాషా, బహు సంస్కృతుల సాంఘిక సిద్ధాంతంగా దీనిని అంగీకరించి అమలు జరపక బప్పదని నెహ్రూ విశ్వాసం.

పండిట్ నెహ్రూ ప్రజాస్వామ్యవాది అవునా కాదా అన్న అంశాన్ని పరిశీలించవల్సిన అగత్యం ఏమిటని మీరు ప్రశ్నించవచ్చు, ప్రజాస్వామ్యం అటు వ్యక్తికీ, యిటు దేశానికీ సంబంధించినది, అందులో వ్యక్తిగతమైనవీ వున్నాయి, సంస్థాపరమైన వీవున్నాయి. వ్యక్తి గతంగా నెహ్రూ ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కట్టుబడివున్న వ్యక్తి అనేది సుస్పష్టం. వ్యక్తి స్వేచ్ఛ, ప్రతి పక్షాలకు ప్రభుత్వాలని విమర్శించే

హక్కు వుండాలని ఆయన విశ్వాసం. పార్లమెంటరీ ప్రభుత్వం, పత్రికలకు స్వేచ్ఛ, స్వతంత్రంగా వ్యవహరించే న్యాయవ్యవస్థ వురిడి తీరాలని ఆయన అనేవారు.

రాజకీయాలు అధికారానికి సంబంధించినవి. ఆ అధికారాన్ని క్రమబద్ధంగా వినియోగించే పద్ధతే ప్రజాస్వామిక పద్ధతి. ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛాపూరిత సంస్థలు చిన్నవీ, పెద్దవీ వుంటాయి. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ, ఇతర సంస్థలు వెనకబడి, ప్రభుత్వమే ఒక సంస్థగా ముందుకు సాగుతోంది.

దీర్ఘ కాలం నాయకత్వం పదవిలో వుండి. ప్రజాస్వామిక బద్ధులైన ప్రజలనూ, సంస్థలనూ తయారు చేయడం సామాన్యం కాదు. పండిట్‌జీ ప్రజాస్వామిక విశ్వాసాలు శాశ్వతంగా విరాజిల్లుతున్నాయి. దయ, న్యాయం ఆయనలో మూర్తిభవించివున్నందునే, ప్రజాస్వామ్యం వర్ధిల్లింది.

—చంచల్ సర్కార్
రాజనీతి పరిశీలకులు

## శాస్త్రీయ దృక్పథం

దేశంలో ఎదుర్కోవలసి వచ్చే వివిధ సమస్యల పరిష్కారానికి శాస్త్రీయ దృక్పథం ఏర్పడడానికి నెహ్రూ నిర్విరామంగా కృషిచేశారు. వైజ్ఞానిక శాస్త్రంలో ఆయనకు ప్రగాఢమైన విశ్వాసం ఉన్నది. దేశంలో వివిధ సమస్యలను శాస్త్రీయమైన పద్ధతి అవలంబించి పరిష్కరించడం అవసరమనీ, వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రాల సాయం లేకుండా దేశం పురోగమించలేదనీ ఆయన విశ్వసించారు.

అణుశక్తి వ్యవహారాల శాఖ మంత్రిగా ఉండడమే కాక నెహ్రూ, శాస్త్ర, పారిశ్రామిక పరిశోధన సంఘం అధ్యక్షులుగా కూడా పనిచేశారు. ఆయన తీవ్ర కృషి మూలంగానే వైజ్ఞానికి రంగంలో అభివృద్ధి సాధన జరిగింది. అణుశక్తి సంస్థకూ శాస్త్ర పారిశ్రామిక పరిశోధన సంఘానికీ ప్రారంభంనుంచీ జీవితకాలం ఆయనే అధ్యక్షులుగా ఉంటూ వచ్చారు. ఏదేశ పురోగమనమైనా ఆధునిక సాంకేతిక విజ్ఞానం సహాయంతో సాధించిన పారిశ్రామిక అభివృద్ధి పైనే ఆధారపడి ఉంటుంది.

విశ్వవిద్యాలయాలలో బోధనావకాశాలు పెంపొందింప చేస్తే మన శాస్త్రజ్ఞుల సంఖ్య పెరిగే అవకాశం ఉన్నదనీ ఆయన అన్నారు. అణుశక్తి సంస్థ ఏర్పాటు కావడంలో ఆయన ఆశలు ఫలించాయి. అణుశక్తి రంగంలో యువ శాస్త్రజ్ఞులకు శిక్షణ జరిపేందుకు కళాశాల ఒకటి నిర్వహిస్తున్న ఈ సంస్థ, క్రమాభివృద్ధి చెందడానికి నెహ్రూ ఎంతో దోహదం చేశారు.

నెహ్రూ తరచుగా ట్రాంబే విచ్చేసినప్పుడల్లా నాకు ఆయన్ను కలుసుకునే అదృష్టం కలుగుతూ వుండేది. ఇక్కడ వివిధ పరిశోధనాలయాలలోనూ

ఫ్యాక్టరీలలోనూ జరుగుతున్న కార్యక్రమాల పట్ల ఆయన ఎంతో ఆసక్తి కనపరిచారు. అంతేకాదు ఇక్కడి పని చేస్తున్న యువ శాస్త్రజ్ఞుల నందరినీ స్వయంగా కలుసుకొని అన్ని విషయాలూ అడిగి తెలుసుకొంటూ ఉండేవారు. అందువల్ల ఇక్కడ శాస్త్రజ్ఞులకు మంచి ప్రోత్సాహం కలిగింది.

—హెచ్చెన్ సేత్నా
అణుసంస్థ డైరక్టర్



## మానవతావాది

చాలా దశాబ్దాల వరకూ నెహ్రూయే భారత దేశమని, ఆయనతోనే 45 కోట్ల భారతీయుల భవిష్యత్తూ, ముడిపడి వుందని ప్రపంచమంతా భావించింది. భారత దేశము రెండు వందల సంవత్సరాలు వలస బానిసత్వంలో వుంది. అయినప్పటికి చాలా మంది ప్రపంచప్రజలనది ఆకర్షించింది. పీడింపబడుతూ దారిద్ర్యంలో పడి కొట్టు మిట్టాడుతూ ఎన్నో కష్ట పరిస్థితులను ఎదుర్కొంటూ వున్నప్పటికి భారతీయులు తమ సంస్కృతినీ, ప్రత్యేకతనూ కాపాడుకున్నారు. స్వాతంత్ర్యము లభించడంలో వారు ఒక అద్వితీయమైన కార్యోత్సాహంతోను, స్వతంత్ర వాణితోనూ ముందుకు వచ్చారు.

ఆయన తత్వమంతా, స్వాతంత్ర్యాన్ని భారతీయ ప్రజానీకానికి వాస్తవమైనదిగా చేయలనే కోరికతోనే నిండి వుండేది. అందుచేతనే ఆయన, దేశపు ఆర్థికాభివృద్ధి పథకాలలో సోషలిస్టు ప్లానింగును ప్రవేశపెట్టారు. స్వాతంత్ర్య ఫలితాలు అందరికీ అందుబాటులో వుండేటట్లు చేయడానికే ఆయన ఆ పద్ధతిని అవలంబించారు.

భారత జీవితంలో ఇతర అంశాల పట్ల కూడా నెహ్రూ చాలా శ్రద్ధ వహించేవారు. విజాన శాస్త్రాన్ని, సంస్కృతిని, ప్రజారోగ్యాన్ని, విద్యాబోధనను అభివృద్ధి చేయడంలో ఆయన ముందడుగు వేశారు. పారిశ్రామిక రంగంలో లోహ పరిశ్రమ, యంత్ర నిర్మాణ పరిశ్రమ లాంటి ముఖ్యమైన శాఖలను ఏర్పాటు చేశారు. భారత దేశం నేడు తన స్వంత చమురు పరిశ్రమను, విద్యుత్ కేంద్రాలను నిర్మించుకుంటోంది. 1947లో భారతదేశంలో 10 లక్షల టన్నుల ఉక్కు మాత్రమే ఉత్పత్తి అయేది. 1964లో అది 60 లక్షల టన్నులకు పెరిగింది. అదే కాలంలో పారిశ్రామిక ఉత్పత్తి, వ్యవసాయోత్పత్తి 50 శాతం పెరిగాయి.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ప్రజల ఆశలు నెరవేరాలంటే ప్రపంచంలో శాంతి అవసరమనీ, అది లేకుండా అవి నెరవేరజాలవనీ ఆయనకు తెలుసు. శాంతి నెలకొన్నప్పుడే ప్రపంచములోని వనరులు వర్ధమాన దేశాల అభివృద్ధికి ఉపయోగపడగలవనీ ఆయన గుర్తించారు.

ఒకసారి నెహ్రూ ఇలా అన్నారు : 'యుద్ధాలకు దిగకుండా వుండటమొక్కటే శాంతి కాదు. అంతర్జాతీయ

సంబంధాలన్నిటి పట్ల మనము క్రియాత్మక దృక్పథాన్ని అవలంబించాలి. సమస్యలన్నిటినీ సంప్రదింపుల ద్వారానే పరిష్కరించుకోవాలనే కోరిక, మొట్టమొదట అంతర్జాతీయ ఉద్రిక్తతను సడిలింప చేస్తుంది. ఆ తరువాత వివిధ దేశాల మధ్య సాంస్కృతిక, వైజ్ఞానిక సంబంధాలను పెంపొందించుకోడంలోనూ, వాణిజ్యాన్ని విస్తరింప జేసుకోడం లోనూ, ఒకరిభావాలను, అనుభవాన్ని, సమాచారాన్ని మరొకరికి అందజేసుకోడంలోనూ మరింత ఎక్కువ సహకారానికి దారితీస్తుంది.

అలీన విధానాన్ని వివరించడం లోనూ, దాన్ని అమలు జరపడంలోనూ నెహ్రు చాలా తోడ్పడ్డారు. అలీన విధానమే భారత దేశపు విదేశాంగ విధానానికి ప్రధాన సూత్రమని ఆయన ప్రకటించారు. జీవితాంతము వరకూ ఆయన దానికే కట్టుబడివున్నారు.

—ఎన్ స్మిర్నోవ్
చరిత్ర పరిశోధకులు

## నవంబరు 14

రాజకీయ వివేకమూ, సూక్ష్మదృష్టి గల రాజనీతిజ్ఞత, జీవితం పట్ల అపారమైన ప్రేమ ఆయనలో మూర్తీభవించాయి. ఆయన ఒక మనోహరమైన వ్యక్తి. దయా స్వభావులు, చురుకైన వారు. ఆయన నేత్రాలు ఆనందంతో మెరుస్తూ వుంటాయి; ఒక్కొక్కప్పుడు అవి విచారపూరితాలవుతాయి. ఆయన చమత్కారి, పిల్లలపట్ల ఆయనకున్న ప్రేమ అసాధారణం. ఆయన ధరించే షేర్వాణీపై, ఎల్లప్పుడూ ఒక రోజా పుష్పం వుంటుంది. ప్రకృతితోనూ, మానవ జీవితంతోనూ సృష్టిలో సజీవమైన ప్రతిదానితోను ఆయనకుగల ఎడబాయని బాంధవ్యాన్ని అది తెలియజేస్తూ వుంటుంది; ఆయనే జవహర్ లాల్ నెహ్రూ.

పార్లమెంటులోనూ, ప్రయాణించే విమానంలోనూ, పత్రికా విలేఖరుల గోష్టులోనూ, క్రికెట్ ఆటలలోనూ, బ్రహ్మాండమైన బహిరంగసభలలోనూ, ప్రశాంతత పఠన మందిరంలోనూ నేను ఆయనను చూశాను. నెహ్రూకున్న లక్షణాలలో నన్ను ఎక్కువ ముగ్ధుణ్ణి చేసినది ఏమిటని ఎవరైనా అడిగితే, పిల్లలపై ఆయకుగల ప్రేమ అని చెబుతాను. నెహ్రూ జన్మదినమైన నవంబరు 14 వ తేదీన భారతీయ బాలబాలికలకు పండుగ దినమవడం చాలా ప్రాముఖ్యత గల విషయం. 1951 మార్చి నెలలో, హోలీ పండుగ నాడు నేను నెహ్రూను తొలిసారి కలుసుకున్నాను. అప్పుడాయన తమ బసలో ప్రజా ప్రతినిధులకు స్వాగతము చెబుతున్నారు. ఆయన దుస్తులు, ముఖం, చేతులూ అన్నీ ఇంద్రధనుస్సులాగ రంగులతో నిండి వున్నాయి. నేను ఆశ్చర్య పడ్డాను. దానిని గమనించి ఆయన నవ్వుతూ యిలా అన్నారు; 'మా ప్రజలకు యీ పండుగ ప్రియమైనది. నాకు నా ప్రజలు ప్రియమైన వారు'.

నిజంగానే నెహ్రూ తన ప్రజలను హృదయ పూర్వకంగాను అత్యంతం గానూ ప్రేమించారు. సోవియట్‌దేశం లో అయిదర్లీ పర్వతంమీద నిలబడి బ్రహ్మాండమైన సోవియట్ లోహ పరిశ్రమ 'మాగ్నితో గొర్స్క్'ను దాని పరిసరాలను తిలకిస్తూ వుండగా నేను నెహ్రూను మళ్లీ చూశాను. ఆ పరిశ్రమకు సోవియట్ ప్రజల సృజనాత్మక కృషికి తమ ప్రశంసలను తెలిపేటప్పుడు నెహ్రూ భారత దేశంలోని భిలాయ్ ఉక్కు కర్మాగారాన్ని గురించి ఆలోచిస్తున్నారు. అప్పటికి భిలాయ్ ఒక ఎర్రని ఎడారి తమ దేశానికీ, తమ ప్రజలకు 'మాగ్నితో గొర్స్క్' లాంటి ఉక్కు పరిశ్రమ కావాలి. అదే అప్పుడు నెహ్రూ ఆలోచన.

నెహ్రూ జన్మదినమైన నవంబరు 14 భారతదేశంలోని బాలబాలిక లందరికీ పండుగ దినం. పిల్లలంటే నెహ్రూకు అపరిమితమైన ప్రేమ.

—ఎన్ పస్తుఖోవ్
సోవియట్ రచయిత

## మ్యూజియము

జవహర్‌లాల్ నెహ్రూ స్మారక మ్యూజియంగా రూపొందించిన తీన్ మూర్తిభవనం, నెహ్రూ జీవితకాలంలో రాజకీయ కలాపాలకు కేంద్రంగా నాయకత్వ పీఠంగా విరాజిల్లింది. సమస్యలలో సతమతమౌతున్నవారు అక్కడికి వెడితే, నెహ్రూ వారికి అభయమిచ్చి వారిలో కొత్త ఆశలనూ, విశ్వాసాన్నీ చిగురింప చేసేవారు. ఇప్పుడా భవనం స్మారక మందిరంగా ఆరాధ్య పీఠంగా రూపొందింది. మ్యూజియంగా మార్చబడిన ఆ భవనంలోని ఆ గదులు, నెహ్రూ రాజకీయకోలాహలాననూ, అప్పటి సందడిలనూ స్ఫురణకు తెస్తాయి.

నెహ్రూ అధికార హోదాలో పర్యటించినప్పుడు, ఆయా దేశాలవారు బహూకరించిన వస్తువులనూ భారత దేశాన్ని సందర్శించ వచ్చిన విదేశ ప్రతినిధివర్గాలు ఆయనకు బహుకరించిన వస్తువులనూ యింపుమింపుగా అన్ని దేశాలకూ ప్రాతినిధ్యం లభించే రీతులో, కొన్నింటిని ఎన్నికచేసి, వాటిని నెహ్రూ స్మారక మందిరాన్ని 1964 నవంబరు 14న ఆయన జన్మదినోత్సవం రోజున ప్రజల సందర్శన కోసము తెరిచారు. అది మొదలు ఇప్పటి దాకా కొన్ని లక్షల మంది ఆ మ్యూజియము చూశారు. నెహ్రు స్మారక చిహ్నంగా, పవిత్ర యాత్రాస్థలముగా పరిగణిస్తున్న ఆ మ్యూజియము ప్రజలు అప్పటి నుంచీ తండోపతండాలుగా వచ్చి దర్శించి వెడుతున్నారు. శలవు రోజులలో ప్రవేశం కోసం ప్రజలు క్యూలో గంటల తరబడి వేచివుండడము పరిపాటి అయింది.

—గ్రేస్ మోర్లే
డైరక్టరు జాతీయ మ్యూజియం

సీరియల్

# మంజీరి

## అన్నపూర్ణారెడ్డి

గడిచినకథ : హౌస్ కీపర్ జానకి, డాక్టర్ సారథి పిల్లలిద్దరినీ ప్రేమగా పెంచుతోంది. జ్యోత్స్న ఏనాడో తన కళామయ ప్రపంచాన్ని నమ్ముకు వెళ్లిపోయింది. డాక్టరుగారు ఒకరోజున ఇంటికి తీసుకొచ్చిన పేషంటువల్ల, జానకి మనసు వికలమవుతుంది....

ఇక చదవండి

"నేనా? అతగాడి గురించి ఆలోచించే పని తప్పా వేరేమి లేదా?".... ముఖంలో.... ఎలాటి భావాలు అవుపించనీయలేదు.

"జానకీ ....నీలో చాలా మార్పు అవుపిస్తూంది.... చాలా స్తబ్దంగా వుంటున్నావు.... నీలో.... ఈ మార్పిడికి కారణం రంగనాథేమో అనుకొంటున్నాను."

"మనసు చదివేసినట్టే చెప్పేస్తున్నారు...." చిన్నగా నవ్వడానికి ప్రయత్నించింది "అతగాడిని గురించి ఆలోచించాల్సిన ఖర్మ నాకేం పట్టలేదు.... అది ముగిసిపోయిన ప్రకరణ - గంభీరంగా బదులిచ్చింది.

'ఒక్కసారి ఆత్మావలోకనం చేసుకో.... నీ హృదయంలో ఏం దాగుందో తెలుసుంది

"నా హృదయంలో ఏమి దాగి వుందో నాకు తెలుసు మీ వాత్సల్యాపూరితమైన చూపుల చల్లదనం...."

"ఏదీ.... ఈలా చూడు నివురుగప్పిన నిప్పులాటి.... నీకూ మాటలొస్తున్నాయే"

"డాక్టరుగారూ.... జీవితంలో ఒక్కసారి తప్పటడుగు వేశాను.... వేసినందుకు బాగానే అనుభవిస్తున్నాను.... తిరిగీ పొరపాటు చేయను.... ఈ రోజులిలా వెళ్ళిపోతే చాలు.... ఈ కోవెల నీడలో.... నా జీవితం ఏ ఇబ్బందీ లేకుండా వెళ్ళిపోతే —" అంది జానకి.

"పొరపాట్లు చేయడం మానవ నైజం.... జీవితాంతం మనిషి ఏదో ఒక పొరపాటు చేస్తూనే వుంటాడు.... గుణపాఠాలు నేరుస్తూనే వుంటాడు....తను చేస్తున్నది రైటనుకొనే పొరబాటూ చేస్తూవుంటాడు.

ఇరువురి కళ్లూ క్షణంకాలం కలుసుకున్నాయి.. ఇరువురి గుండెల్లో ఏదో మౌనగీతం.

### 25

మరో పదిహేను రోజులు దొర్లిపోయాయి. హాల్లోఅడుగుపెట్టిన సారథి

"ఏమర్రా పిల్లలూ.... మనం ఈ ఊరు వదిలేయాలి ?" అన్నాడు....

"ఎందుకు డాడీ ?" - ఏకకంఠంతో అడిగారు రవి, విజ్జీలు.

కళ్ళెత్తి చూచింది జానకి.... ఆ చూపుల్లో ఎన్నో ప్రశ్నలు, ఎన్నో సందేశాలు.

"ఇదిగో బదిలీ ఆర్డరు.... ఈ మజిలీలో బాధ్యత అయిపోయింది మరో మజిలీకి మకాం ఎత్తేయాలి...."

"డాడీ.... ఇక్కడే వుండి పోదాం ?"

తండ్రి చేయిపట్టుకొని గునిసింది విజ్జి.

పాపని ఎత్తుకొని.... "లేదు తల్లీ ప్రభుత్వము వారి ఉత్తరువు ధిక్కరించేందుకు లేదు.... ఇంకో వారంరోజులే వ్యవధి."

ప్రశ్నార్థకంగా చూస్తున్న రవిని మరోచేత్తో దగ్గర తీసుకుని తల నిమిరాడు సారధి.

"జానకీ, నీకు చేతినిండా పని"

"కానీయండి.... తప్పేదేముంది?"

చిరునవ్వుతో బదులిచ్చింది జానకి, కృతజ్ఞతా బద్ధమగు బంధంలో కాల క్రమేణా చనువూ, అధికారము ఏర్పడ్డాయి.

"ఒరేయ్ నారీ మేం.... ఇంకో ఊరెళ్ళి పోతున్నాముగా...." సంతోషంగా చెప్పాడు రవి.

"అదేం?"బిక్కముఖంవేశాడు నారి.

"అవునురా.... నారీ.... నాన్న గారికి బదిలీ అయింది...." - తండ్రి చేతుల్లోంచి క్రిందకు జారి నారాయణ దగ్గరకు వెళ్ళింది విజ్జి.

"అయితే నేనూ వచ్చేస్తాను మీతో"

"అలాగేలే.... మీ పెద్దమ్మ ఒప్పుకుంటే.... తీసుకెళ్తాం కదా డాడీ...." అంది విజ్జి.

"అవునమ్మా...." బదులిచ్చాడు సారధి.

డాక్టరుగారి బదిలీ గురించి ఊళ్ళో అప్పుడే వార్తలందాయి.... ఊళ్ళోని పెద్ద మనుష్యులు హెల్త్ సెంటర్‌లో సారధిని కలిసి "మీరు వెళ్ళేందుకు వీల్లేదు డాక్టరుగారూ....

"ఇంతకాలానికి మాకుతగ్గ డాక్టరు దొరికాడని సంతోషపడ్డాము. అంతలోనే వెళ్ళిపోవడం మా కిష్టంలేదు .... మేము .... ఈ బదిలీ ఆమోదించం .... పైకి రాసేస్తాం ...." ఏకగ్రీవంగా పట్టుపట్టారు.

అందరినీ కలియచూచి.... "క్షమించాలి .... నావిధ్యుక్తధర్మం నేను నెరవేర్చాను .... అంతే .... ఈ ఊళ్ళో శాశ్వతంగా వుండాలని మాత్రం నేను కోరుకోవడంలేదు .... మరో డాక్టరు కూడా మీఔదార్యాన్ని, మంచితనాన్ని రుచిచూచే అవకాశం కల్గించాలి ...." అని సౌమ్యంగా బదులిచ్చాడు.

చాలాసేపు తర్జన భర్జనలు జరిగాయి. పెద్దినాయుడు డాక్టరు వూరు వదలిపెటే పనేలేదని వాదించాడు. రాత్రికి రాత్రే వెళ్ళి ఆర్డర్ కేన్సిల్ చేయిస్తానని పట్టుపటాడు.

"పెద్దవారు .... అలా మాట్లాడ్డం ధర్మంకాదు ...." అంటూ వినయంగా బదులిచ్చాడు సారధి.

ఇక బీదబిక్కి జనం మాట చెప్పక్కర లేదు. నోటితో వెళ్ళొద్దని చెప్పలేక దీనంగా మూగగా ప్రార్థించారు.

అందరికీ చిరునవ్వే సమాధానంగా లభించింది ....

గతమూడేళ్ళుగా తను ఎరుగున్న జానకి వేరు .... చూపులో బెదురు, మాటలో వినయం, మనిషిలో అణుకువ .. పెద్దలపట్ల భయభక్తి .. ఇవన్నీ కలిపితే .... ఆవిడ జానకి ....

కానీ .... ఈ జానకిలో చొరవ, దృఢ నిశ్చయము, ఆలోచన .... ఇవన్నీ కలబోసుకుని అవుపిస్తుంటె ఆశ్చర్యంగా చూస్తూండి పోయాడు సారధి ....

"జానకీ .... గాయత్రి .... నాకు .... తోడబుట్టిన చెల్లెలు మాత్రమే .... నీవు .... నాకు అంతకన్నా ఎక్కువైన వ్యక్తివి .... ఆత్మీయురాలివి. నీ సుఖమే నా సుఖము. ఈశూన్య గృహంలో వెలుగునిండే దాకా .... నిన్నిక్కడ అట్టిపెట్టుకోవాలనేది దురాశేమో, స్వార్థమేమో"

"ఏమిటి మీరనేది - మిమ్మ నేనెక్కడికి పోతాను ? నాకు ఆశలూలేవు, ఆశయాలు అంత కన్నాలేవు. నారాయణను కలుపు కొంటె నాకు పిల్లలు నలుగురు.... వారి ఆలనాపాలనే నా జీవితాశయము అంతే ...." - బదులిచ్చింది.

చప్పునలేచి జానకి చేయి అంది పుచ్చుకొన్నాడు సారధి. తల పైకెత్తి సారధి ముఖంలోకి చూడలేక పోయిం దామె.

రెండు రోజుల తరువాత రవీ విజ్జిలు ఊళ్లో ఎరుగున్నవారికి, స్కూలు పిల్లలకు వీడ్కోలు చెప్పడానికి వెళ్లారు. కూడా నారాయణ వెళ్ళాడు. ప్రయాణం ఆ సాయంత్రానికి పెట్టు కున్నారు.

మునసబుగారి సవారి బండి ఇంటి ముంగిట ఆగింది.

ఆఖరు నిమిషం మిగిలిపోయిన అత్యవసర సామానులు అన్నీ గబగబా సర్దేయసాగింది....

రవి, జానకి మెడ చుట్టూ చేతులు వేసి ఒడిలో కెక్కితే విజ్జి వీపు మీద ఆనుకుంది. నారాయణ దగ్గరగా నుంచున్నాడు.

"పిన్నీ" - పిల్చాడు రవి.

"ఏం బాబూ ! ...." చుబుకం తర్జ నితో లేవనెత్తి కళ్ళలో కళ్ళుంచింది జానకి.

"ఆ నవరత్నం లేదూ ?"

"అవును .... వుంది .... ఏం ?" అంది.

"ఆ నవరత్నం ఏదో ఒక మాట అంటూనే వుంటుంది, పిన్నీ"

"పోనీలే బాబూ.... కొందరి మన స్తత్వమే అంత ....".

"కాదు పిన్నీ .... అసలు మమ్మల్ని కాదు .... దారిలో వెళ్ళే ప్రతి పిల్ల వాడినీ పిలిచి వాళ్ళను అనవసరంగా తిడుతుంది. అలాటి నవరత్నం .... ఈరోజు వెళ్ళి, మేం వెళ్తున్నాం అని చెప్పేసరికి నన్ను రెండు చేతులతో చుట్టేసి గట్టిగా ఏడ్చేసింది .... విజ్జి జుట్టు సవరించి బట్టలు సవరించి ఇద్ద రినీ ముద్దులు పెట్టుకుంది...."

"ఊ"

"అదికాదు పిన్నీ రోజూ అలా తిట్టేది కదా .... ఈ రోజెందుకు ఏడ్చింది ?"

గదిలో సర్దుకొంటున్న సారధి హాల్లోకి వచ్చి "నవరత్నం, మీ రను కొన్నట్టు చెడ్డదీ కాదు, పిచ్చిదీకాదు .... ఆవిడది వింత మనస్తత్వం .... పిల్లలంటే అమితమైన ఇష్టం .... కానీ తనకంటూ పిల్లలు లేరు...."

బండిలో సామాను సర్దారు ....

పిల్లలు సంభ్రమంగా బండెక్కి కూర్చున్నారు.

జానకి ఓమారు ఇల్లంతా కలియ చూసింది. ఇల్లు తమది కాకపోయినా గత రెండేళ్ళుగా ఆశ్రయమిచ్చినందుకే ఆ ఇంటిమీద ఏదో తెలియని మమ కారం... ఒక్కగదిలో ....ఎన్నో ఎన్నో మరపురాని, స్మృతులు .... మనసుకు కష్టం కల్గించినవి, బాధించినవి ....

స్వాంతన నిచ్చినవి.... మనిషి జీవితమే .... అనుభూతుల వలయం .... గదులన్నీ ఓ మారు కలియ తిరిగి బండిలో వచ్చికూర్చుంది జానకి.

సీతారామమ్మ, ఆమె భర్త బండి దగ్గరి కొచ్చారు.

"గుడ్డ కట్టిన బుట్ట అందించి .... సున్ని వుండలు.... వుంచు".... అంది. ఆవిడ కళ్ళలో ఆప్యాయత....

బండిలోకి తొంగి చూచి "ఒరే నారిగా.... భద్రము.... అల్లరి చెయ్యొద్దు" అంది.

తిరిగి జానకి నుద్దేశిస్తూ "అమ్మా వీడు బెంగేసుకుంటే .... మనిషితో పంపేయండి" అంటూ జానకి గడ్డం పుణికింది సీతారామమ్మ.

పిల్లలను ముద్దాడింది....

జానకి కళ్ళు చెమ్మగిల్లాయి .... "వస్తాం పిన్నీ బాబాయ్" అంటూ చేతులు జోడించింది.

పిల్లలు 'టా టా', చెప్పారు.

ఎడ్ల అదలింపు మువ్వల చప్పుడు. చక్రాలు ముందుకు కదిలాయి.

వెనక బడి పోతున్న ఇంటి కేసి ఓ మారు చూచి కళ్ళు తిప్పుకుంది జానకి. పిల్లలు ముగ్గురూ, కబుర్లు చెప్పుకొంటున్నారు... ఆకళ్ళలో... ముఖాల్లో ఏ విచారం, దిగులూ, అనుభూతులూ లేవు. వారిదో వింత ప్రపంచం.... వీడ్కోలివ్వడానికి వచ్చిన పెద్దలతో మాట్లాడుతూ బండి వెంట నడుస్తున్నాడు సారథి.

వెనక్కు పడిపోతున్న ఊరును చూస్తూండి పోయింది నలుగురి బాధ్యత వహిస్తున్న జానకి.

ఇంత కథ చెప్పాక జ్యోత్స్న మళ్లీ వచ్చిందా అని గాని, జానకి డాక్టరు గారి కేమవుతుందని గాని నన్ను అడక్కండి. (సమాప్తం)











## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

అమెరికాలోని పదమూడు వలస రాష్ట్రాలూ బ్రిటన్‌పై తిరుగుబాటు ప్రకటించాయి. చారిత్రాత్మకమైన ఆ నాలుగో రోజు. ముగింపు ప్రధాన సంఘటనలూ తెలుసుకువేందుకు....

ఇక చదవండి

"నా చేతులైతే వణక వచ్చుకాని ఈ గుండెకాయ మాత్రం చలించదు" - స్టీఫెక్ హాప్‌కిన్సు తీర్మానంపై ఓటు వేయనప్పటికి స్వాతంత్ర్య పత్రముపై చేవ్రాలు వుంచాడు. యుద్ధభీతిలో మునిగివున్న న్యూయార్క్ రాష్ట్ర ప్రతినిధులు ఇతనిని సంతకము చేయమన్నారు కాని ఎల్సాన్ మాత్రమూ దానిపై చేవ్రాలు వుంచలేదు. ఈ సభికులకేమీ ముందు చూపులేదని అతను భావించాడు.

దాడిచేయనున్న సైనికులవల్ల ఫ్రాన్సెస్ హాప్‌కిన్సు ఇల్లూవాకిలీ తొందరలోనే దోచుకోబడతాయి. స్టాకన్ శత్రువుల చేజిక్కి వారివల్ల నానా హింసలూ పడి దారుణ మరణము పొందుతాడు. హార్ట్‌కి చెందిన పొలాలు ధ్వంసమవుతాయి. అతని ఇంటిని తగలబెట్టి జంతువుని వేటాడినట్లు అతనిని వేటాడుతారు. తుఫానులో గుర్రంపై ప్రయాణముచేసి వచ్చిన సీజర్ రోడ్నీ, అతని చేవ్రాలు ఫలితముగా బ్రిటన్ నుంచి ఎటువంటి వైద్య సహాయమూ లేక కాన్సర్ వ్యాధితో మరణిస్తాడు.

మనోదౌర్బల్యము గల జాన్‌మార్టన్ భయాందోళనలవల్ల ఆరోగ్యము చెడగొట్టుకొని సంవత్సరముపాటు పక్కమీద వుంటాడు. కోరితెచ్చుకున్నావని మిత్రులు బంధువులు అంటారు. హారిసన్ సంతకము పెడుతూ పక్కనే వున్న ఎల్‌బ్రిడ్జీ గెర్రీతో తమాషాగా అన్నాడు: "మనందరిని వురితీసే సమయంలో నీకంటే నాకు చాలా సదుపాయంగా వుంటుంది. నాపని ఒక్క నిముషంలో అయిపోతుంది గాని నేను వెళ్ళిపోయాక ఒక్కగంటసేపు నువ్వు గాలిలో అల్లల్లాడాల్సివస్తుంది." (హారిసన్ కొంచెం లావుపాటి మనిషి, ఎల్‌బ్రిడ్జి గెర్రీ పీలమనిషి.)

దక్షిణ కెరోలినో ప్రతినిధులు ఛార్లెస్టన్ తిరిగి వచ్చే ప్రయత్నములో వున్నారు. రట్లెజ్ వెంటనే సేనలో చేరి తన పటాలానికి నాయకత్వము వహిస్తాడు. అతనిని శత్రువులు పట్టుకొని ఫ్లోరిడాలోని సెయింట్ అగస్టిన్ దీవిలో బందీలుగా వుంచుతారు. ముప్పై సంవత్సరాలు నిండని థామస్ లించ్ ఆరోగ్యము చెడగొట్టుకొని ఫ్రాన్సు

వెడుతూండయ, అతని ఓడ సముద్ర మధ్యములో మునిగిపోతుంది.

స్వాతంత్ర్య గీతిక తమని పిలువగా అదే తమ గమ్యముగా భావిస్తూ పర్వత ప్రాంతాలవారు పీఠభూముల వారు పంటపొలాల వారూ తమ భయ సంశ యాలను విస్మరించి ఒకే ధర్మమూ, ఒకే లక్ష్యమూ, ఒకే మార్గమూ తమని ఏకత్రాటిమీద నడుపగా, ధీరో దాత్తులై సాహసముతో ముందుకి వురికారు.

థామ్సన్ తన జర్నల్‌లో యిలా పేర్కొన్నాడు :

"విసుగెత్తివున్న ప్రతినిధులు సభ నుంచి వెళ్ళిపోదామని వుద్యుక్తులవు తున్నారు. కాని సభ వాయిదా పడ లేదు. హాన్‌కాక్ అధ్యక్ష స్థానాన్ని తీసుకొని తొందరగా తెమిల్చేశాడు. ఈ స్వాతంత్ర్య పత్రాన్ని ముద్రించాలని అన్నారు. వీటి ప్రతులను ఆయా రాష్ట్రసభా మందిరాలలో అంటించి సామాన్యులు చదివేటట్లుగా ప్రచారం చేయాలన్నారు. ప్రతి చర్చి మందిర ములోనూ ప్రార్థన అనంతరం ఈ స్వాతంత్ర్య పత్రపాఠాన్ని చదవా లన్నారు. సర్వసైన్యాధ్యక్షునికి ఇది తమ బహిర్గంగ ప్రకటనగా ప్రచు రించమని ఆదేశమిచ్చారు. జాన్ యాడమ్స్, జఫర్‌సన్, డాక్టర్ ఫ్రాంక్లిన్ ముగ్గురితో కూడిన కమిటీ నూతన సంయుక్త రాష్ట్రాలకు ఒక ఆజ్ఞా ముద్రను తయారు చేసేందుకు ర్పాటుఏ అయినది."..... కార్యదర్శి థామ్సన్‌కి రాసిన ప్రతికి మేలు ప్రతులు జఫర్‌సన్ ఆదేశము ప్రకారము ముద్రణకు ఇచ్చారు. ఒక వార్తాహరుని డనలప్ ముద్రణాలయా నికి పంపారు. అతను రాత్రంతా పని చేసి వీటిని కూర్చడం ముగించి, శుక్ర వారము ఉదయము చివరి ప్రూఫులు జఫర్‌సన్‌కి అందజేశాడు. ఆ ప్రూఫులు ఏ అక్షరానికా అక్షరము అతి శ్రద్ధగా తప్పు లేకుండా సరిచూచి ముద్రణ ముగించమన్నాడు జఫర్సన్. వెంటనే కాపీలు అచ్చయి రావడము పంచి పెట్టడము జరిగింది. సభాకార్యక్రమా నంతరము యింకా చర్చలు సాగు తున్నప్పటికీ ప్రతినిధులు తమ బంధు మిత్రులకి వుత్తరాలు రాశారు.

బొస్టన్‌లోని ఒక మిత్రునికి స్వాతంత్ర్య తీర్మాన పత్రం పంపుతూ "ఈ లక్ష్యసాధనకై దేశము యావత్తు కృషి చేస్తోంది," అన్నాడు జాన్ యాడమ్స్. శామ్యూల్ యాడమ్స్ తన బంధువయిన జాన్ పిట్స్‌కి లేఖ వ్రాస్తూ ఇలా అన్నాడు: "ఈ నిర్ణయమే తొమ్మిది నెలలు క్రితము తీసుకొని వుంటే, కెనడా అంతా మన వైపున వుండేది." అధ్యక్షుడు హాన్‌కాక్ వాషింగ్టన్‌కి ఈ తీర్మానపు ప్రతిని పంపుతూ అన్నాడు : 'ఇంతప్రాముఖ్యం గల విషయము ఏ సభికులపరిశీల నకూ వచ్చివుండదు. ఏ కమిటీకూడా ఇటువంటి విపత్కర విషయాలను పరిశీలించి వుండదు.'

పెన్సిల్వేనియా 'ఈవెనింగ్ పోస్ట్' అనే పత్రికలో జులై ఆరవ తేదీ శనివారమునాడు "కాంగ్రెస్ సభ

వారి తీర్మానము, స్వాతంత్ర్య ప్రతి పాఠము" వెలువడాయి. ఈ "కాంగ్రెస్ సభవారు విదేశ ప్రభుత్వాన్ని ఎందుకు కూలదోయమంటున్నారో సహేతు కంగా వివరించబడింది. - క్వేకర్లు ముందు ఈ అస్థిర వార్తలను నమ్మ లేదు. స్వాతంత్ర్య పత్రపాఠము వెలు వడగానే వారికి కొంచెము గుండెనిబ్బ రము కలిగింది. తమకు కావలసిన సరుకులు నిర్ణయింపబడిన ధరలకి దొరికేటట్లు చూస్తామంటున్నారు. కాంగ్రెస్‌వారు నిర్ణయించిన ధరకు తేయాకు అమ్మబడుతుంది. ఇతర పానీయాలు, పంచదార, బెల్లము, వాసనద్రవ్యాలు, చాక్‌లెట్, ఆహారపు దినుసులు మొదలైనవన్నీ యిక నుంచి సరసమైన ధరలకు అమ్మబడు తాయి. స్థానిక చందాదారులు 'ఈ వెనింగ్ పోస్టు' లో ప్రచురిత మవు తున్న సామాన్య ప్రకటనలకు మాత్రమే అలవాటు పడివుండడము చేత, ఈ నూతన సందేశము వారి కేదో అద్భుతముగాను, క్రొత్త పిలుపు వలెను కనబడింది. క్రిస్టాన్‌డాబ్టిన్, ఎల్‌బ్రిడ్జీ గెర్రీకి వ్రాశాడు "నీకు శుభమగుగాక : ఇప్పుడు మనము కళ్ళెము బిగించి జీను వేశాము. ఈ గుర్రము మనని తప్పుదారులు పట్టించ కుండా స్వాతంత్ర్యగమ్యానికి చేర్చాలి" - మేరీలాండ్ నుంచి శామ్యూల్ ఛేజ్ ఒక ప్రత్యేక వార్తాహరుని ద్వారా జాన్ యాడమ్స్‌కి ఈ చీటీ పంపాడు : "మీరు నిర్వహిస్తున్న పవిత్రకార్యము తలుచుకుంటే, నాకెంతో ఆనందముగా వుంది, మీ జీవితాలు ధన్యమైనవి"

జఫర్‌సన్‌కి, అతని చిరకాల మిత్రుడు జాన్ పేజ్, వ్రాశాడు : "స్వాతంత్ర్య పత్రము చదివి ఆనం దాతిరేకము పట్టలేకపోయాను. స్వ రాష్ట్రాల ఐక్యతను భగవంతుడు సదా కాపాడు గాక !"

రిచర్డ్ హెన్రీ లీ ఇలా తెలియ బరిచాడు. "పరిశీలనా ప్రతి తీర్మాన ప్రతి ఇంచుమించు ఒకే రూపు తీసు కొనడము మీ అందరి ఆత్మశుద్ధికీ తార్కాణము. కాంగ్రెస్ సభను, ఆయా రాష్ట్రాలను, ఇందుకు అభినందించ వలసివున్నది" - ఫిలడల్‌ఫియా షెరిఫ్‌ని తమ భవనానికి ఎదురుగా దీనిని అంటించమని హాన్‌కాక్ ఆదేశ మిచ్చాడు. జులై ఎనిమిదవ తేదీ మధ్యాహ్నం పన్నెండుగంటలు తాత్కా లిక కార్యక్రమన మయంగా నిర్ణయింప బడింది. అదే సమయాన ఆంగ్లరాజు లాంఛనాలు, పతాకాలు, రాజ్య చిహ్నాలు ఇవన్నీ ఒక గుట్టగా పోసి ప్రజామందిరాల ఎదుట ప్రజల సమ క్షాన దహనకాండ జరుగుతుంది. ఆ ఉదయము షెరిఫ్, మాక్‌నైర్ అను వుద్యోగిని ప్రభుత్వ భవన గోపురము పైకి ఎక్కి గంట మోగించమన్నాడు. ఆ ఘంటారవము ప్రజలకొక నూతన సందేశాన్ని తెల్పింది. ఆ సమయాననే పట్నములో గల పన్నెండు ప్రార్థనా మందిరాలనుంచీ చర్చి గంటలు మ్రోగాయి. ఈ పిలుపుకి పట్నంలోని ప్రజలందరూ మధ్యాహ్న సమయాన

ప్రభుత్వ భవనము ముంగిట గుంపులు గుంపులుగా జేరారు. వీరందరూ సామాన్యులు. చిన్న చిన్న వ్యాపారులు, రైతులూను. రాజనీతి గురించీ తమ కష్టాలకు వెనుక గల సాంఘిక రాజకీయ హేతువుల గురించీ తెలియని అతి సామాన్యులు. వీరిలో కొందరు నీగ్రోలు, రెడ్ ఇండియనులు కూడా వున్నారు.

రక్షణ మండలిలో సభ్యుడైన జాన్ నిక్సన్ - పన్నెండు గంటల వేళ తన కంచుకంఠంతో స్వాతంత్ర్య పత్రాన్ని - ఏ మాటకామాట విడమరిచి చదివాడు. "ఇవి దార్శనికములలైన సత్యాలూ, వీటికి వేరే రుజువు అక్కర లేదు" అన్నాడు. పత్రప్రకటన పూర్తి కాగానే, సైనికులు పదమూడుసార్లు తుపాకులు పేల్చారు. ప్రజలు హర్షాధ్వానాలు చేశారు. ఆంగ్లరాజుకి సంబంధించిన చిహ్నాలన్నిటికీ నిప్పంటించి, వాటిని పెద్ద మంటలలో పడవేశారు. ఉపన్యాసాలు అభినందనలు సంతోష ప్రకటనలు వీటితో ఆ సాయంత్రమంతా ఒక పర్వదినంగా గడిచిపోయింది.

ఈ శుభవార్త ఉత్తరం నుంచి దక్షిణానికి, ఒక రాష్ట్రం నుంచి మరో రాష్ట్రానికి ప్రయాణం చేసింది. గుర్రాల ద్వారాను, ఓడల ద్వారాను ఆనోటా ఆనోటాను ఈ శుభసందేశము







దేశవ్యాప్తమయింది. కొన్ని ప్రదేశాలకి మూడు రోజుల్లో చేరుకుంటే మరికొన్ని ప్రదేశాలకి ఈ వార్త చేరేందుకు నెల రోజులకు పైగా పట్టింది. "ఛాంప్ ప్లెయిన్ సరస్సువద్ద బెనడిక్ట్ ఆర్నాల్డ్ తన సైనికులకీ స్వాతంత్ర్య పత్రాన్ని చదివి వినిపించగా వారు హర్ష పులకాంకితులయ్యారు. అన్ని కష్టాలు పడ్డప్పటికి ఈ మాట వినగానే వారు తమ బాధలన్నీ మర్చిపోగలిగారు. ప్రతి ఒక్క ముఖములోనూ సంతోషము వెల్లివిరిసింది. "మాదీ ఒక జాతి, మాకూ ఒక దేశము అను ఐక్యతా భావం వారి ముఖాలలో కనిపించింది" అని తెలియ బరిచాడు జనరల్ సెయింట్ క్లేర్.

బాస్టన్‌లో వుత్సవమూ, పత్రము మీద సంతకాలు పెట్టిన రెండు వారాలకి జరిగింది. ఫిలడల్ఫియాలో కంటె ఎక్కువ మంది ప్రజలు ఈ వుత్సవాలలో పాల్గొన్నారు. ఎబిగైల్ తన భర్తకి ఇలా వ్రాసింది: "నేనూ ప్రజలతో కలిసి రాజవీధికి ఈ స్వాతంత్ర్య పత్రము వినేందుకు వెళ్ళాను. అందులోని ప్రతిమాట ప్రజలు ఎంతో శ్రద్ధగా విన్నారు. ప్రకటన పాఠం చదవడం పూర్తికాగానే భగవంతుడు అమెరికా సంయుక్త రాష్ట్రాలని రక్షించు గాక - అని ప్రజలు జయధ్వనాలు చేశారు. మూడుసార్లు అలా విజయ వాచకము పలికారు. చర్చి గంటలు మ్రోగాయి. ఫిరంగులు గౌరవసూచకంగా పేలాయి. ప్రతి ముఖంలోను ఆనందాతిరేకకమే! ఆ సాయంత్రము రాజుగారి చిహ్నాలను ఆయుధాలను ఒక ఊరేగింపుగా రాజవీధిలో తీసుకెళ్ళి, అక్కడ ఒక చితి ఏర్పరిచి, అందులో పడవేశారు. ఆ ప్రకారము రాజుగారి అధికారము, ఆరాష్ట్రంలో అంతమొందినదని ప్రజలకి తెలుపడమే దీనివుద్దేశం".

సంతకాలైన మూడు వారాలకి కనెట్‌కట్‌లోని ఒక వార్తా పత్రికలో ఈ వార్త వెలువడింది. ఒక మత గురువు బాలునికి జ్ఞానస్నానం చేయిస్తూ 'ఇండిపెన్‌డెన్సు' అని నామకరణము చేశాడు.

న్యూహావెన్‌లేని రివరెండ్‌స్టయిల్స్, ప్రకటన ప్రతి అందుకొని చదివిన మీదట తన డైరీలో ఇలా వ్రాసుకున్నాడు: "ఇది ఈ మధ్యాహ్నం చదివాను. స్వాతంత్ర్య మనగా ఏమిటో మొదటిసారి బోధపడింది. పదమూడు సంయుక్త రాష్ట్రాలు స్వాతంత్ర్య లక్ష్యంకోసం ప్రజా రాజ్యాలు కానున్నాయి. దయామయుడైన ప్రభువు వారిని ఆశీర్వదించు గాక!"

స్టయిల్సే తన డైరీలో మరొక విషయం కూడా రాసుకున్నాడు. "అయిదు వందలమంది వడ్రంగులు ఈ రోజున క్రవున్ పాయింటికి వెళ్తున్నారు.రక్షణ కృషిలో పాల్గొనేందుకు వెళ్తున్నారట. ఈ ఖండమంతా నవజీవనంతో తొణికిసలాడుతోంది." రోడ్ ఐలెండ్‌లోని ప్రావిడెన్సులో ఈ ప్రకటన చదవటమయ్యాక పదమూడు తడవలు తుపాకులు పేల్చారు. పదాతి

దళము పదమూడు ఫిరంగులు పేల్చింది. అల్‌ఫ్రెడ్, కొలంబస్ నౌకలు పదమూడు పదమూడు చొప్పున ఫిరంగులు పేల్చాయి. ఆ సాయంత్రము విందులో పదమూడు 'టోస్టులు' చెప్పారు. స్వతంత్ర రాష్ట్రాలకు, గౌరవనీయులగు కాంగ్రెస్ ప్రతినిధులకు స్వతంత్ర వ్యాపారానికీ శుభాకాంక్షలు తెలిపారు.

లాంగ్‌ఐలేండ్‌లోని హంటింగ్ టన్‌లో ప్రజలు, కనుచూపుమేరలో శత్రునౌకలు నిలిచివుండగా స్వాతంత్ర్య ప్రకటన వినేందుకు గుమిగూడారు. న్యూజెర్సీ రాష్ట్రపు బ్రిడ్జిటౌన్‌లో కాంగ్రెస్ ప్రతినిధులలో ఒకరైన జనాథన్ ఎలమర్ ఇలా అన్నాడు. "ప్రపంచంలో ఏ ప్రాంత ప్రజలకూ లభించని అపూర్వావకాశము అదృష్టము మనకు లభించాయి. చాలా దేశాలలో కాలాను గతంగా ఆయా ప్రభుత్వాలు ఏర్పడాయి. వాటి స్థాపనకు పరిస్థితుల తాకిడియే ముఖ్యకారణ మవుతోంది. కాని యిక్కడ మనము ఎంతో దూర దృష్టితో స్థిమితంగా ఆలోచించుకు చర్చించుకు ఈ ప్రభుత్వ స్థాపనకు ముందంజ వేశాము. మన భాగ్యరేఖ ఈ నిర్ణయాన్ని కార్యరూపానికి తీసుకు రావడంలో వుంటుంది" - మేరీలాండ్ రాష్ట్రపు బాల్టిమోర్‌లో కోర్టుభవనము వద్ద స్వాతంత్ర్య ప్రతిని చదివారు. విలియంస్మిత్, జాన్‌బాయిడ్, బెంజిమిన్ లెవీ ఈ ముగ్గురితో కూడిన

కమిటీ ఉత్సవ ఏర్పాట్లు గావించింది. వర్జీనియాలోని విలియమ్స్‌బరోలో కోర్టుభవనము ముందు రాజభవనము ముందు ఈ ప్రతిని చదివారు. ఆ చుట్టు పట్ల గ్రామాలనుంచి ప్రజలు తండోప తండాలుగా వచ్చి, ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. లార్డ్‌డన్మార్‌తో ఈ మధ్యనే తలపడ్డ సైనికులు, ఈ వుత్సవాలలో తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. వర్జీనియా గెజెట్ అను పత్రిక ఈ విధముగా ప్రకటించినది: "పోయిన బుధవారం వుదయము రైట్ ఆనరబుల్ డన్‌మోర్ ప్రభువు తన నౌకాబలాన్ని రెండుగా విభజించి అందులో పదివోడలకు నిప్పంటించి మిగతా పన్నెండు ఓడలతోనూ, వర్జీనియానుంచి జారుకున్నాడు. సముద్రదొంగలకు సైతము సిగ్గు తెప్పించే ఘాతుకాలు పన్నెండు నెలలపాటు గావించి గత్యంతరం లేక పారిపోయాడు."

రట్లెజ్ ఒక ప్రతిని దక్షిణ కెరోలినా రాష్ట్ర అధ్యక్షుడైన తన సోదరునికి పంపాడు. ఛార్లెస్టన్‌పై ఈ మధ్యనే పార్కర్ ప్రభువుదాడి జరిపి వుండడంవల్ల దక్షిణ కెరోలినా రాష్ట్రప్రజలు యుద్ధ బీభత్సాన్ని చూసి వున్నారు. అప్పటికే ఏర్పడిన విప్లవ ప్రభుత్వము ఈ స్వాతంత్రోత్సవము మరుపురాని పర్వదినంగా జరిపేందుకు నిశ్చయించుకున్నారు. స్వాతంత్ర్య పత్రముపై సంతకాలైన నెల్లాళ్ళకిగాని జార్జియా రాష్ట్రము ఈ పండుగ చేసుకోలేకపోయింది. జార్జియాలో స్వాతంత్ర్య ప్రకటనను నాలుగుసార్లు చదివారు. వారందరూ ఆనందోత్సాహంతో పండుగ చేసుకున్నారు. అ సాయంత్రం 'సెవన్నా' వీధులలో మూడవ జార్జి దిష్టిబొమ్మతో ఒక వూరేగింపు జరిగింది. ఆ వూరేగింపు కోర్టు భవనము ముందు కొచ్చి ఆగింది. అక్కడ ఒక గోరి ఏర్పాటుచేసి ఈ దిష్టిబొమ్మను అందులో పూడ్చిపెట్టి అంత్యక్రియలు యధావిధిగా జరిపించారు.

అంత్యక్రియలు జరిపిస్తున్న మత గురువు ఇలా అన్నాడు: "మూడవ జార్జి తను బ్రిటిషు సింహాసనాన్ని అధిష్టిస్తున్నప్పుడు చేసినప్రమాణాలన్ని విస్మరించి, వాటిని నిర్లక్ష్యము చేస్తూ మన దేశరాజ్యాంగాన్ని కాలదన్ని తోటి మానవుల పవిత్ర హక్కును నేలరాస్తూ వుండడంవల్ల అందుకు ప్రతి, ఆ దౌర్జన్యచిహ్నాన్ని, భూస్థాపితము చేస్తున్నాము. లంచగొండితనము, దౌర్జన్యము, అరాచకత్వము, వీటితో అమెరికా ప్రజలపై పాలన సాగించగలమని అనుకోడం అవివేకమని - అమెరికా ప్రజలను బానిసలుగా చేయలేమనీ, వారిపై అధికారం, ప్రతాపము చూపలేననీ. మూడవ జార్జి తెలుసుకుందుకు" .... ఈ స్వాతంత్ర్య ప్రతి మూడవ జార్జికి, సంతకాలైన మూడు నెలలకి అందింది. నార్త్‌ప్రభువు తయారుచేసిన ఉపన్యాస భాగాన్ని మూడవ జార్జి పార్లమెంటులో చదివి వినిపించాడు. ఇప్పుడు తిరుగుబాటు దార్లు దొంగచాటుగా గాక స్పష్టంగా

ముందుకువచ్చారు. ఇది మనకెంతో లాభదాయకము. ఆంగ్లప్రజలలో యిందు విషయమై రెండు అభిప్రాయాలంటూవుండవు. న్యాయస్థాపనకై మనం ప్రయోగిస్తున్న సైనికబలం తప్పని సరి అయినదని మనదేశంలోని వారు ఇప్పటికైనా ఒప్పుకుంటారు.'' కార్లయిల్ ప్రభువు తిరుగుబాటు దార్ల పొగరుమోత్తనానికి ఆశ్చర్యపడ్డాడు. ''ఈ పత్రము ఆధారముగా ఒక ప్రభుత్వము ఏర్పడుతుందా? ప్రభుత్వ స్థాపనకు ఇది ఒక మార్గమా ? ఇదంతా కుట్రదారుల కాండ, అరాచకానికి బాట'' - అన్నాడు. అమెరికనులు పేర్కొన్న అన్యాయాలు ఆరోపణలు నిరాధారములని తోసివేశారు. ఆంగ్ల పార్లమెంటు వారు. ''అమెరికనులు ప్రచురించిన పత్రముపై మాకుగల అభిప్రాయము వేరుమాటలలో మీకు వివరించి చెప్పనవసరములేదు. వారు బరితెగించి, దురాశాపూరితులై, కొందరు కుట్రదారుల మాయలకు లోబడి, రాజభక్తిని విస్మరిస్తున్నారు. రాజుపై తిరుగుబాటు జరుపుతున్నారు'' అన్నారు వారు మూడవ జార్జి నుద్దేశిస్తూ. కామన్స్‌సభలోని ఈ అభిప్రాయాలు అందరూ ఏకకంఠంతో పలకలేదు - లండన్ నగరము మేయరు జాన్‌విల్కిస్ మూడవ జార్జికి ఇలా సందేశము పంపాడు. ''వారి స్వాతంత్ర్య ప్రకటన మార్గాంతరము లేని విపత్కర పరిస్థితులలో ఆత్మధృతితోను, ధైర్యసాహసాలతోనూ గావింపబడింది. భవిష్యత్, వారికి న్యాయము చేకూరుస్తుంది. ఈ ప్రకటనని వారు మీ నౌకాబలము సురక్షితముగా ఆ దేశము చేరుకున్నాక వేశారు. దానినిబట్టి వారిలో గల విప్లవశక్తిని అంచనా కటండి''



అమెరికనులకి హితుడైన ఛాతమ్ ప్రభువు పార్లమెంటులో ఇలా అన్నాడు: "మిత్రులారా, చరిత్రపరిశీలన నాకు ఇష్టమైన విషయాలలో ఒకటి. చరిత్ర పాఠాలను మర్చిపోయిన మానవులే వెనక పడుతున్నారు. పురాతనచరిత్రను, గ్రీసు రోమూ చూపిన దేశభక్తి ఆదర్శప్రాయములని మనము భావిస్తున్నప్పుడు, ఈనాడు అమెరికనులు చేసిన అపచారమేమిటి? వివేకంతో, నిశ్చల చిత్తంతో ఒక్క పొల్లుమాటలేకుండా తమ ఉద్యమాన్ని వివరిస్తూ తమ లక్ష్యాలను చెపుతున్న ఆ సజ్జనులపట్ల మీకెందుకీ అకారణ ద్వేషము? పురాతనచరిత్ర మనకి చెప్పే పాఠము మర్చిపోతున్నారా? అంత విశాలమైన దేశాన్ని మనము దాస్యబంధములో వుంచగలమా? అది సాధ్యమయే విషయమా?" .... ఫిలడల్ఫియాలో స్వాతంత్ర్య పత్రము ప్రచురితమవగానే, దాని ప్రతులను ముఖ్యమైన చోటన్నిటికీ పంపారు. కాని ఫ్రాన్సుకి అధికారరీత్యా ఆ విషయము ఆరునెలల వరకూ తెలియలేదు. జులై ఎనిమిదవ తేదీన పంపిన లేఖ, శత్రుహస్తగతమయిందో ఏవిధముగా పోయిందో గాని తెలియలేదు. సైలాస్‌డీన్ ఈ విషయము, పారిస్‌లోవుండగా బ్రిటిషు వార్తా పత్రికలనుంచి తెలుసుకున్నాడు.

ఫ్రెంచివారు ఈ ప్రకటనకు ఎంతో సంతోషించారు. ధనవంతులకు ముందుముందు ఇది బుద్ధి గరపుతుందని కొందరు భావించారు. పదహారవ లూయీ, మాజీమంత్రి టర్గాట్, అమెరికనుల ముందు చూపుకి సంతసించాడు. "ఈ ప్రజలు మానవాళికి ఆశ చూపుతున్నారు. అమెరికా ముందు ముందు ఒక వరవడి కాగలదు. సామాన్య ప్రజలు వివిధ బంధాలతో, ముడివేసే ముష్కరుల బారినుంచీ, స్వార్థపరుల సంకెళ్ళనుంచీ బయటబడి శాంతి మార్గాన ఎట్లా స్వాతంత్ర్యాన్ని పొందవచ్చో - సర్వప్రపంచానికీ ఈ ప్రజలు చూపుతున్నారు. అమెరికా ఒక నమూనాగా నిలుస్తుంది - అణచి వేయబడ్డ ప్రతిజాతికీ తన విప్లవశంఖాన్ని వినిపిస్తుంది. ప్రభుత్వమన్నది న్యాయబద్ధమూ క్రమబద్ధమూ అయింది. విశాల దృక్పథంతో నడుచుకోవాలని, అన్ని దేశాలకూ ఇది ఒక గుణపాఠము చెబుతుంది"

జులై తొమ్మిదవ తేదీన స్వాతంత్ర్య పత్ర ప్రతులు వాషింగ్టన్ ప్రధాన కార్యాలయానికి అందజేయబడ్డాయి. పత్రముతోపాటు హాన్‌కాక్ పంపిన లేఖ చదువుకున్నాడు వాషింగ్టన్: 'మానవ కార్యాల భవిష్యత్‌ని మనము చెప్పలేము. వాటి ఫలితాలు ఎలా వుంటాయో కూడా అనూహ్యం. కాని వివేకవంతులగు ప్రజలకు ముందుతరాలవారికీ మన మీనాడు తొక్కుతున్న బాటకు కొంతవరకు సంజాయిషీ చెప్పుకోవలసి వున్నది. కార్యకారణ సిద్ధాంతము మానవుని చేతలకు ఫలితాన్ని నిర్ణయిస్తోంది. కాని మానవుడు ఆ ఫలితాన్ని తెలుసుకొనలేడు" - హాన్‌కాక్ లేఖ చదువుకున్నాక వాషింగ్టన్ స్వాతంత్ర్య

పత్రాన్ని సావగధానముగా పఠించాడు. తన అంరక్షకులలో ఒకనిని పిలిచి, ఈవిధముగా ఆజ్ఞాపించాడు: "ఈ సాయంత్రము ఆరుగంటల వేళ సైనికులందరూ తమ తమ పటాలాలలో పెరేడ్‌కి, కాంగ్రెస్ సభవారు ప్రకటించిన స్వాతంత్ర్య పత్రాన్ని వినవలెను. మనము ఎందుకు ఏకారణాల వల్ల ఈ విప్లవము జరుపుతున్నామో ఆప్రకటనలో సహేతుకంగా వున్నది." ప్రతి సైనికోద్యోగికీ, ప్రతిసిపాయికీ ఈ ప్రకటన సందేశము నూతనోత్సాహాన్ని నూతన విశ్వాసాన్నీ కలిగిస్తుందనీ, ఇది ఒక మహత్తర సందేశమనీ శాంతిభద్రతలపై మన దేశభవితవ్యము ఆధారపడి వున్నదనీ, ఆ సుస్థిర శాంతి స్థాపనకై ఈనాడు మనము ఆయుధాలుచేత బట్టవలసివచ్చిందనీ, భగవదాశీర్వాదమువల్ల మనకి విజయము లభించగలదనీ - ఆ విజయసాధనకు గల ధైర్యోత్సాహాలు ప్రజాబలము ఈ పత్ర నిర్మాతలు మనకి ఇస్తున్నారనీ పేర్కొన్నాడు వాషింగ్టన్.

వర్జీనియాలోని తన సోదరుడు జాన్‌కి ఇలా వ్రాశాడు: "ఈ వేసవిలో మేము రక్తపుటేరులు దాటవలసి వున్నది. సైనికబలములోగాని ఆయుధ సంపత్తిలోగాని మేము శత్రువుతో ఎంతమాత్రమూ తూగలేము. కాని ఒక్కటే విశ్వాసము: మన వుద్యమం క్రమబద్ధమైనదైతే, మనది న్యాయ మార్గమైతే, భగవంతుడే ఏదో విధముగా మనకి సహాయపడగలడని, ప్రభువు చల్లని హస్తమే మనని ఈ ఉపద్రవమునుంచి గట్టెక్కిస్తుందని, ఆ ఒక్క విశ్వాసంతోనే నేను వున్నాను"- మాన్‌హట్టన్ భూములలో పదిహేను వేల మంది విప్లవ సైనికులు మంగళవారము సాయంత్రము ఆరుగంటలకు సమావేశమాయారు. ప్రతీ పటాలాన్ని వుద్దేశిస్తూ ఆ పటాలాలముందు స్వాతంత్ర్య పత్రము గంభీరకంఠములో చదువబడింది. పత్రపాఠము చదువుతున్నపుడు వాషింగ్టన్ అశ్వారూఢుడై సైనిక పంక్తులను పరిశీలించాడు. సైనిక సమూహాలకి వెనుక







ఈ సైనిక విన్యాసము చూసేందుకు ప్రజలు గుమిగూడి వున్నారు. ఏ సైన్యాధిపతీ అటువంటి సేనను చూసి వుండడు. ఆ సేనలో పదహారునుంచి డెబ్బయి సంవత్సరాలవరకూ వయసు గలవారు వున్నారు. రైతుబిడ్డలు, జాలర్లు వున్నారు. న్యూ ఇంగ్లండులోని ప్యూరిటనులు దీనిని సైతాన్‌పై యుద్ధముగా ప్రకటిస్తూ ఇందులో చేరారు. వర్జీనియా, కెంటకీ రాష్ట్రాలలోని యువకులు యుద్ధకాంక్షతో చేరారు. తను సైన్యాధికారము స్వీకరించిన నాటినుంచీ, ఈ సేనలో క్రమశిక్షణ ఏకోన్ముఖ ప్రయత్నము కలిగించాలని ప్రయత్నిస్తున్నాడు. కడుపుమంటతో ద్వేషజనితులైన సైనికులు ప్రతీకారోద్దేశం కలవారై, తామూ తమ ఆఫీసరూ ఒకటేనన్నట్లుగా ప్రవర్తించసాగారు. కెప్టెన్ ఒక విషయం ఆజ్ఞాపిస్తే "ఆ పని నువ్వే చేసుకోకూడదూ కెప్టెన్?" అని సమాధాన మిచ్చేవారు. ఇందులో చాలామంది మూడు నెలల పాటు ఈ పోరాటములో పాల్గొనేందుకు మాత్రమే ఖరారునామా వ్రాసి ఇచ్చారు. వారిని సుశిక్షితులుగా చేదామనుకుంటే అది సాధ్యము కాలేదు. సైన్యమనగా శిక్షణకులోబడి వుండాలని చెబితే, కొందరు పరారీ అవుతున్నారు. తమ పొలాలు, కుటుంబాలు వొదిలివొచ్చిన వారవడముచేత, సైనిక శిక్షణ అంటే ఏమీ తెలియని వారవడముచేత, వాషింగ్టన్‌కి ఈ సేనని ఏకతాటిమీద నడిపించడమనేది ఒక మహాసమస్య అయింది. పడమట చూస్తే వాషింగ్టన్‌కి శత్రు నౌకా దళం కనిపిస్తోంది. స్టాటెన్ దీవి అప్పటికే శత్రుశిబిరమైపోయింది. అయిదువందల ఓడలు ఆంగ్ల సేనలను అట్లాంటిక్ సముద్రము దాటిస్తున్నాయి. ముప్పైరెండు వేల సుశిక్షితమగు సైన్యము నూతన ఆయుధాలతో యుద్ధ నిర్వహణలో మంచి అనుభవముగల సైన్యాధికారులతో యావత్ ప్రపంచములోనూ సాటిలేని మేటిసేన, అని పేరుతెచ్చుకున్న బ్రిటిష్ సైన్యం మాన్‌హట్టాన్ దీవికి ఎదురుగా మరొక దీవిలో సైనిక శిబిరాలు వేసుకుని స్థావరము ఏర్పరచుకుని, పోరుకి సిద్ధముగా వుంది.

దిగువ మాన్‌హట్టన్‌లోని పౌరులలో కొందరు. ఈ సంబరంలో బౌలింగ్ గ్రీన్‌వద్దవున్న మూడవజార్జి విగ్రహము వద్దకు వచ్చి, పదిహేను అడుగుల ఎత్తుపైన అశ్వారూఢుడైన రాజు విగ్రహాన్ని ధ్వంసముచేయడానికి ఉపక్రమించారు. కోడిగుడ్డు ఆకారముగల పాలరాతి పీఠముపై ఉక్కుతో చేయబడ్డ విగ్రహమది. దానిపై కొంత సీసపుపూత, మరి కొంత బంగారుపూత వున్నాయి. యువకులలో కొందరు విగ్రహపీఠం పైకి ఎక్కారు. అందులో ఒకడు నేర్పుగా రాజుగారి గుర్రము పైకి ఎక్కి 'తాడు ఇవ్వండి - తాడు ఇవ్వండి' అని బిగ్గరగా అరిచాడు. ఈ దుశ్చేష్టితానికి అక్కడ గల కాపలాదారు - 'దిగండి - కిందికి దిగండి' అని పెద్దగా అరిచాడు. కాని అతని మాటలు ఎవరూ

లక్ష్యపెట్టలేదు. ఆ ముసలివానిని పక్కకినెట్టేశారు. కొందరు కుర్రవాళ్ళు పడవలంగరు గొలుసులుతీసుకొచ్చారు. మరి కొందరు నిచ్చెనలు పట్టు కొచ్చారు. తాడుని విగ్రహము చుట్టూచుట్టి గొలుసులతో దానిని లాగి క్రిందపడవేసే ప్రయత్నము ప్రారంభిం చారు. కాపలాదారు ఫిర్యాదు విన్న షెరీఫ్ రక్షణకమిటీ సభ్యులిద్దరితో అక్కడకు వచ్చాడు. ఈ విధ్వంసక కాండ చూసి షెరీఫ్ తన ఉత్తరువు ప్రకటించడానికి వుద్యుక్తుడయాడు.

'కొంచెం దారివ్వండి, తప్పుకోండి' అంటూ ఒక సైనికుడు షెరీఫ్‌ని తోసుకుంటూ వెళ్ళిపోయాడు. పక్కన వున్నవారు నవ్వారు. ఆ సైనికుడు తిరిగి షెరీఫ్‌తో అన్నాడు : "సైన్యానికి సీసం కావాలి. మా తుపాకులలో గుళ్ళులేవు. అందుకని ఈ విగ్రహాన్ని పడగొడ్తున్నాం." షెరీఫ్‌కి అప్పుడు అర్థమయింది - ఆ మాటానిజమే. ఈ వొక్క విగ్రహముతో కొన్నివేల తుపాకీగుళ్ళు తయారు చేయవచ్చు. లిచ్‌ఫీల్డ్‌లో దీనిని కరిగించవచ్చు. కాని దీనిని లిచ్‌ఫీల్డ్‌కి పట్టుకెళ్ళేందుకు గుర్రాలు బళ్ళూకావాలి. విగ్రహాన్ని పడగొట్టడమనే ప్రయత్నము నిర్భీతి తో జరిగింది. యువకులందరు ఈ విధ్వంసకాండలో వుత్సాహముతో పాల్గొన్నారు. కాపలాదారు మాత్రము - 'ఎలానేలకొరిగిపోతోందో ఆ విగ్ర హము !' అని కన్నీరుపెట్టుకున్నాడు. కాని ఉద్రేకపూరితులగు యువకులకు అతని రోదనము వినే వ్యవధిలేదు. సుత్తులు గునపాలు పట్టుకొచ్చి ఆ విగ్రహాన్ని ముక్కలుగా కొట్టడము మొదలుపెట్టి ఈ లోహాన్ని బళ్ళలోవేసి లిచ్‌ఫీల్డ్ గ్రామానికి పంపారు. లిచ్‌ఫీల్డ్ గ్రామములో వాల్కాట్ పర్యవేక్షణ క్రింద విగ్రహశిథిలాల నుంచి నలభై రెండువేల ఎనిమిది వందల యనభైఎనిమిది తుపాకీ గుళ్ళు తయారుచేశారు. అంతేకాక పది ఔన్సుల బంగారము దొరికింది. ఈ తుపాకీ గుండ్లని పెట్టెలో పెట్టి న్యూయార్క్‌లోని జనరల్ వాషింగ్టన్‌కి పంపాలి. జులై తొమ్మిదోతేది రాత్రి జనరల్ వాషింగ్టన్‌కి ఈ విగ్రహ విధ్వంసకకాండ తెలిసింది. అది వినగానే అతని కెంతో ఆగ్రహం కలిగింది. తను ఇంతకష్టపడి ఒక సైన్యాన్ని నిర్మించేందుకూ వారిలో శిక్షణ ప్రవేశపెట్టేందుకూ శ్రమి స్తూంటే, ఈ ఉద్రేకచర్యలనూ, విధ్వంసక చర్యలనూ తను సహించ లేడు. ఈ సైన్యాన్ని నిర్మించేందుకు తను పడుతున్నపాట్లు ఎవరికీ అర్థము కావడము లేదు. ఇటువంటి సమ యాన ఈ మాదిరి అల్లర్లు తమ విజయానికి హానికరము. కాని తన స్వభావసిద్ధమగు ఆత్మనిగ్రహముతో వెంటనే తన ఆక్షేపణ తెలిపాడు. "బ్రాడ్వేలోని విగ్రహము పడగొట్టిన సైనికులు ఆ కార్యాన్ని ప్రజోపయోగం కోసమే చేసివుండవచ్చు ; కాని, అది పద్ధతికాదు. ఆ చర్య ఒక నిర్బాధ్యతాయుతమగు అల్లరివలె లోకం కళ్ళకు కనబడుతుంది.

సైనికులు శిక్షణతో ప్రవర్తించాలే తప్ప ఇటువంటి అల్లర్లలో పాల్గొన డము వల్ల మొత్తము సైన్యానికే హానికర మవుతుంది. ఇటువంటి పనులు నా కెంతమాత్రము అంగీ కారము కావు. ఇక ముందు సైనికులు తమంతతాము గాని ఇతరుల ఆదేశమువల్ల గాని ఇటువంటి కార్యా లలో పాల్గొనరాదు. తుపాకీ గుళ్ల సేనకి చాలా అవసరము. కాని వాటిని సేకరించే మార్గము ఇది కాదు." విప్లవ సేన న్యూయార్క్ నగరాన్ని వదలివేయవలసివస్తే పట్నాన్నీ వున్న దున్నట్లు వదిలివేయడమా లేక ధ్వంసంచేసి శత్రువుకి నిరుపయోగము గా చేసి వెళ్ళిపోవడమా ? వాషింగ్టన్ సలహా దారులలో చాలా మంది, ఉపసంహరించు కోవడమే తటస్థిస్తే దీనిని భస్మీపటలము చేదామే తప్ప శత్రువుకి స్థావరముగా దీనిని వుప యోగపడనీయవద్దు - అన్నారు. సైనిక రీత్యా విధ్వంసకాండ అవసరమవు తుంది. ఒక మెట్టు నుంచి కోట దిగువకు వచ్చి చుట్టూ దృశ్యాన్ని పరికించాడు వాషింగ్టన్. రానున్న ప్రమాదము గురించి అతనికి స్పష్టముగా తెలుసు. సునిశిత బుద్ధి, సువిశాల దృక్పథముగల వాషింగ్టన్ ప్రతి విష యాన్నీ లోతుకి వెళ్ళి చూడ గలడు .... 'ఇది వెనుకటి కథే ! మామూలు కథే. తగినంత అంగబలములేదు; ఆయుధసంపత్తిలేదు : ఐక్యతలేదు. కాంగ్రెస్ ప్రతినిధులలో అనేకులు స్వలాభాపరులై స్వప్రయోజనము కోసము సామాన్య జనులను బాధలకు గురి చేసి తాము భాగ్యవంతుల వుతున్నారు. పౌరులలో కూడా కొందరు ఈ అదనులో ధనవంతులయేందుకే తాపత్రయపడుతున్నారు తప్ప దేశ రక్షణ కోసమై పాటుపడటము లేదు. ఉద్రేకవంతులు, కిరాయి సిపాయిలు అయిన వీరితో మహాసేనని సృష్టిం చడము అసాధ్యమైన విషయము. ప్రపంచములోని అన్ని సేనావాహిను లకీ ఏర్పడ్డసమస్యే నేడు ఇక్కడకూడా ఏర్పడుతోంది' - అని తన డైరీలో వ్రాసుకున్నాడు వాషింగ్టన్.

వేరువేరు సమస్యలు, అనేక వైపుల నుంచి వొత్తిడీ, వుద్రేకభరితమగు వాతావరణము వీటన్నిటిలోనూ ఏ మాత్రమూ చలించకుండా భవిష్యత్ మీద నమ్మకమే తనకు పట్టుగొమ్మగా ఈ మహాసేనాని అడుగువేస్తున్నాడు. ముందు తరాలవారు ఈ నూతన ఖండములో స్వతంత్రులుగా స్వేచ్ఛా వాయువు పీల్చేందుకు, తాను ఖడ్గధారియై ఈ సేనని ముందుకు నడుపవలసి వచ్చింది. శత్రువు అతి బలసంపన్నుడు తమది న్యాయపక్ష మను నమ్మకము తప్ప శక్తియుక్తు లలో తమకీ శత్రువుకీ పోలిక ఏమిటి ? అతను తమకు అన్నివిధాలా మించిన వాడు ; కాని తాము తమకోసము కాక చారిత్రిక ధర్మమైన దేశక్షేమము కోసము మానవక్షేమము కోసము పోరాడుతున్నారు. తన సైనికులని వుద్దేశిస్తూ ఇలాఅన్నాడు : "ఈనాడు మనము చూపే ధైర్యసాహసాలు.

విశదవర్తనా ఈ నేలపై జనించే లక్షోపలక్షల బాలబాలికలకు మార్గ జ్యోతికాగలవు. భగవంతుడు మనకి మన కర్తవ్యతా నిర్వహణములో తగిన ధైర్యసాహసాలు ప్రసాదించాలని, మన ఉద్యమములోని సద్భావమూ సచ్చింతనా - ఈ రెండే మనని విజయపథానికి కొనిపోవాలనీ ఆ ఉత్తమ లక్ష్యాలే మనకి ధీరత్వము ప్రసాదించాలనీ కోరుతున్నాను. ఇది మనకు భగవంతుడిచ్చిన ఒక మహదవకాశము ; తనస్వాతంత్ర్యము కోసము తను పుట్టి పెరిగిన గడ్డకై పోరాడే నరుని సత్కాంక్ష, మహాసేనలు నడిపించే సేనానుల యుద్ధ తంత్రాలను అధిగమించి విజయము పొందగలదని మానవాళికి మనము రుజువుచేయాలి."

స్వాతంత్ర్య పత్రముపై సంతకాలు వుంచిన యాభై సంవత్సరాల అనంతరము, అదే జులై నాలుగవ తేదీన ఎనభై మూడు సంవత్సరాల వృద్ధుడొకాయన తన చివరి స్వాతంత్ర్య దినోత్సవము జరుపుతున్నాడు. మాంటిసెల్లోలోని స్వగృహములో విశ్రాంతి తీసుకొంటున్న జఫర్‌సన్ గత పది రోజులుగా మృత్యుపాశముతో ఘోరాటము సాగిస్తున్నాడు. ఈ స్వాతంత్ర్య దినోత్సవ జయంతి ఎంతో జయప్రదముగా జరపాలని అతను ఏర్పాట్లు చేశాడు. తన స్నేహితులకీ వారసులకీ ఎవరికి అప్ప జెప్పవలసినవి వారికి అప్ప జెప్పాడు. తన యింటిని అమరికగా సర్దుకొని, సమాధిపై లిఖించవలసిన మాటలు కూడా వ్రాసిపెట్టుకొని, కడపటి ప్రయాణానికి సిద్ధముగా ఉన్నాడు. తను ఏ చందుకాపెట్టెపై స్వాతంత్ర్యపత్రాన్ని లిఖించాడో, ఆపెట్టెను, ఎంతో పవిత్రము పూజ్యము అయిన స్మృతులతో కూడిన వస్తువును, తన మనుమరాలికి వివాహకానుకగా ఇస్తూ, ఆ పెట్టె దిగువున ఇలా వ్రాశాడు: థామస్ జఫర్‌సన్ ఈ పెట్టెను ఎలెన్, జోసఫ్‌లకు తన అనురాగ చిహ్నముగా యిస్తున్నాడు. 1776 మేలో తను ఇచ్చిన నమూనా ప్రకారము దీనిని ఒక వడ్రంగితయారు చేసిపెట్టాడు. స్వాతంత్ర్య పత్ర లిఖితము ఈ పెట్టెమీదనే జరిగింది. ఇది ఏమంత అందమైన పెట్టెగాదు. దీనిలో ప్రత్యేకత ఏమీ లేదు. కాని ఆయేటి కాయేడు గడుస్తున్న కొద్దీ దీని విలువ నా దృష్టిలో పెరిగింది. ఇది కాల్పనిక విలువ మాత్రమే - ఆ విషయము మర్చిపోవద్దు" అన్నాడు జఫర్‌సన్.

యువక విప్లవ కారునిగా ఈ పెట్టెని తను వుపయోగించేవాడు. వర్జీనియా రాష్ట్రపు గవర్నరైనప్పుడూ, విదేశాంగ మంత్రిగా ఫ్రాన్సు వెళ్ళినపుడు, జార్జి వాషింగ్టన్‌కి కార్యదర్శిగా వున్నప్పుడు, జాన్‌యాడమ్స్ అధ్యక్ష పదవీ కాలంలో ఉపాధ్యక్షునిగా వున్నపుడు, తను అమెరికా సంయుక్త రాష్ట్రాలకుతృతీయ అధ్యక్షుడైనప్పుడు, తను ఈ చిన్న పెట్టెనే వుపయోగించేవాడు. ఈ పెట్టెకు తన మనోమందిరంతో అదృశ్యబంధము వున్నది. తన భావచింతన వ్యక్తపరిచే, యిరవైవేల వుత్తరాలను ఈపెట్టెకు తెలుసు. తన

మనోభావాలన్నీ యీ మంజూషకు తెలుసు. తన పూర్వ మిత్రులైన శామ్యూల్ యాడమ్స్, థామస్ పెయిన్, చార్లెస్ థామ్సన్; ప్రఖ్యాతవైజ్ఞానికవేత్త అయిన ఎడ్వర్డు జెన్నర్; జోసఫ్ ప్రీస్టిలే, అలెగ్జాండర్ వాన్ లెంబోల్డ్; ఇతర దేశాలలోవున్న మిత్రులు లఫాయేట్, కోస్కిస్కో, తన శిష్యులైన మాడిసన్, మన్రో మొదలైన అనేకులతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలకు ఈ చిన్న పెట్టే సాక్షి. విట్నీకి, కాటన్ జిన్ నమూనా పంపమని వ్రాశాడు. మెర్రీ వెదర్ లూయీ, విలయమ్ క్లార్క్‌ల సాహసయాత్రను ప్రోత్సహిస్తూ సూచనలు చేశాడు. లూసియానా ప్రాంతానికి చెందిన బేరసారాల విషయంలో, నెపోలియన్ రెట్టింపుధర చెపితే అధరకే కొనేందుకు అంగీకరించాడు.

ఎన్ని గొప్పసంగతులు తెలుసు ఈ చిన్నపెట్టెకు. జఫర్‌సన్ తన సమాధిపై క్లుప్తముగా ఈ మాత్రమే వుండాలనీ ఒక్క మాట అధికంగా చేర్చరాదనీ అన్నాడు: ఇక్కడ భూమిలో నిదురిస్తున్నాడు.

థామస్ జఫర్‌సన్ - అమెరికా స్వాతంత్ర్య పత్ర నిర్మాత.

వర్జీనియా మత స్వాతంత్ర్య శాసన నిర్మాత. వర్జీనియా విశ్వ విద్యాలయ స్థాపకుడు.

మత స్వాతంత్ర్య మనగా ఎవరి అంతరాత్మ ప్రకారమువారు నడుచుకోగల స్వేచ్ఛా, మతము మనిషిని మూఢునిగా చేయకుండా ఎవరికి వారు తాము కోరిన రీతిని నడుచుకోగల స్వాతంత్ర్యము.

వర్జీనియా విశ్వవిద్యాలయము మహదాశయాలతో నూతన ప్రపంచములోని యువకులు స్వాతంత్ర్యోపాసకులైన తరువాత తెలుసుకోవలసిన బాధ్యతలను చెపుతూ, మానవ మేధకు గల సువిశాలస్వాతంత్ర్యాన్ని కాపాడేందుకు ఏర్పడ్డ విద్యాలయం. వర్జీనియా విశ్వవిద్యాలయ ముఖద్వారంపై జఫర్‌సన్ ఆదేశ ప్రకారము ఈ మాటలు లిఖించబడ్డాయి. 'సత్యము మీకు దర్శన మిస్తుంది - అ సత్యమే మిమ్ములను స్వతంత్రులుగా చేస్తుంది.' జులై మూడవ తేదీ నాటికే జఫర్‌సన్ దైహిక శక్తి జ్ఞాపక శక్తి వుడిగిపోతున్నాయి. ఆరోగ్యము దిగనాసిల్లుతోంది. తనకి మందివ్వడానికి వచ్చిన వైద్యుని అడిగాడు జఫర్‌సన్. "మిత్రమా, ఇది జులై నాలుగో తేదీయేనా ?".

"ఇవ్వాళ మూడు" అన్నాడు డాక్టర్.

జఫర్‌సన్ చిరునవ్వు నవ్వుతూ "ఇంకా కొద్ది గంటలే కదా" అన్నాడు.

వాషింగ్టన్ నగరానికి వుత్సవాలలో పాల్గొనేందుకు రమ్మనమని జఫర్‌సన్‌కి అంతకి క్రితమే ఆహ్వానమొచ్చింది. స్వాతంత్ర్య పత్ర నిర్మాతలలో ముగ్గురు మాత్రమే సజీవులై వున్నారు. జఫర్‌సన్, జాన్ యాడమ్స్; చార్లెస్ కరోల్. ఈ ముగ్గురినీ వుత్సవాలలో పాల్గొనేందుకు అమెరికా ప్రభుత్వము ఆహ్వానించింది. ఆహ్వానానికి జఫర్

సన్ ఇలా సమాధానము రాశాడు: "లోబడటమా, కత్తిపట్టడమా అను అసందిగ్ధంలో, ఎదిరించడమే కర్తవ్య మని మేము ఆనాడు నిర్ణయానికి రాబోయేముందు మమ్మల్ని ఆవరించిన భయాందోళనలో చివరికి ఒకే నిర్ణయానికి వచ్చి ఆ నిర్ణయ ప్రకారము చేవ్రాలు వుంచిన శుభఘడియలు అవన్నీ తలపుకు వస్తాయి. ఆనాడు మాతో మా ఆనందాన్ని భయాన్నీ పంచుకొన్న కొద్ది మందిని వాషింగ్టన్ నగరము వస్తే చూడగలుగుతాను. ఆనాటి మా నిర్ణయము మన దేశ ప్రజలొక్కరికే చెందినది కాదు. బంధాల వల్ల కట్టి వేయబడ్డ ప్రజలందరినీ బంధవిముక్తులు గమ్మని చెప్పిన సందేశము. అజ్ఞానం నుంచీ మూఢత్వము నుంచీ మేల్కొని, వివేక మార్గాన న్యాయ మార్గాన నడువమనీ, స్వయం నిర్ణయ ప్రభుత్వానికి అది ఆశీర్వాదముగా రక్షణగా ఏర్పడుతుందనీ - మానవాళికి ఒక సందేశము తెలిపాము. మేము ఏర్పరచిన బాట మానవుని స్వతంత్రునిగా చేస్తూ, అభిప్రాయ ప్రకటనకూ హేతుమార్గానికీ చక్కని అవకాశము కలిగిస్తుంది. మా తరానికి చెందిన వ్యక్తులకు ఈస్వాతంత్ర్య దినోత్సవము మధురస్మృతులతో నిండిన దీక్షాదినము. అకుంఠిత విశ్వాసమే ఆనాడు మమ్ము ముందుకు నడిపింది." 1826 జులై నాలుగో తేదీ మధ్యాహ్నమువేళ మాంటిసెల్లీలో జపర్‌సన్ మరణించాడు. వర్జీనీయా కొండభూముల్లో జన్మించిన యీ మాన్య చరితుడు స్వాతంత్ర్య దీక్షకై తన శక్తిని వెచ్చిస్తూ, సోపాన పంక్తుల నెక్కి, తన వారికి దారి చూపాడు. ఆ జులైనాలగవ తేదీయే జాన్‌యాడమ్స్‌కి కూడా చివరి స్వాతంత్ర్య దినోత్సవం. తొంభై ఒక్క సంవత్సరాలు గడిపిన యీపూజ్యుడు బ్రెయిన్‌ట్రీలోని వ్యవసాయక్షేత్ర గృహాములో తన మరణశయ్యపై పరుండివున్నాడు. పాతిక సంవత్సరాల క్రితము అధ్యక్షపదవి విరమించాక, ఇక్కడి కొచ్చి స్థిరపడి పోయాడు యాడమ్స్. పదవీ విరమణ చేశాడేగాని బుద్ధి బలమూ, మనో బలమూ ఎప్పటి వలెనే వున్నాయి. నిశితదృష్టితో చతుర సంభాషణతో కఠిన సత్యాలు ముఖం మీద చెప్పగల ధీమంతుడు యాడమ్స్. ఎబిగెల్ చనిపోయి, అప్పటికి ఎనిమిది సంవత్సరాలయింది. కుమారుడు జాన్ క్విన్సి అమెరికా అధ్యక్షునిగా ఎన్నికయాడు. అతను వాషింగ్టన్ వెళ్తూ మార్గమధ్యములో వున్నాడు. ఊపిరిపీల్చడం కొంచెం కష్టంగా వున్నప్పటికీ జాన్ యాడమ్స్ మనోక్షేత్రముపై ఎన్నో జ్ఞాపకాలు మొగ్గతొడుగుతున్నాయి.

అది ప్రజ్ఞావంతులకాలము. ఎవరైనా ఈ కథను లోకానికి చెబుతారా? ఛెస్ట్‌నట్ వీధిలోని ప్రభుత్వ భవనంలో తాము తలుపులు బిగించి సాగించిన చర్చల సారాంశము, తమ వాద ప్రతివాదాలు, ఎత్తుపైఎత్తులు, తమ లక్ష్యశుద్ధీ, తమశ్రమదమాలూ, తాము రక్తమాంసాలు ధారపోయడము, ఈ

విప్లవ విజయానికి తాము చూపిన పట్టుదల ఎవరైనా ఏనాటికైనా లోకానికి చెబుతారా ?

విప్లవ మనగా ఏమిటి ? యుద్ధమా? కాదు. ఎంత మాత్రమూ కాదు. విప్లవ ఫలితమూ, విప్లవ పరిణామమూ యుద్ధం గావచ్చుకాని విప్లవ మెప్పుడూ ప్రజల మనసునుంచి జనిస్తుంది.

ప్రజ్ఞావంతుల కాలానికి చెందిన తాను తన ప్రజల మనసు తరిచి వారి సంకల్పాలను ఏకోన్ముఖం చేయగల సత్కృషికి పాటుబడ్డాడు.

ఆయారాష్ట్రాల ప్రతినిధులు చివరికి ఏమయ్యారు? ఈ వలసలన్నీ చివరి వరకూ ఐక్యతను కనబరిచాయా? విప్లవము పూర్తికాక పూర్వమే ఫిల డల్ఫియాలోని ఆ మహామహుల సంఖ్య యిరవైకి తగ్గిపోయింది కదా ! ఇరవై మంది కూడా లేరు విప్లవ ఫలితము వీక్షించేందుకు. శామ్యుల్ యాడమ్స్, జాన్‌హాన్‌కాక్, జోసియా బార్‌ట్లెట్, ఎల్‌బ్రిడ్జ్‌గెర్రీ, ఆలివర్ వాల్‌కాట్ వీరందరూ న్యూ ఇంగ్లండు లో గవర్నర్లుగా పనిచేశారు. ఎడ్వర్డు రట్లేజ్, బెంజిమిన్ హరిసన్, బర్టన్ గ్విన్నెట్ వీరు దక్షిణాన గవర్నరులు గా పనిచేశారు. థామస్ మాక్కీన్ ప్రధాన న్యాయమూర్తిగా, ఆ తర్వాత పెన్సిల్‌వేనియా గవర్నరుగా పని చేశాడు. జాన్ డికెన్సన్ విషయ మేమైంది ? రాజసేనలో తన సైనిక హోదాకి రాజీనామానిచ్చి, వాషింగ్టన్ సేనలోకి సామాన్య వుద్యోగిగా చేరి తన దేశభక్తిని ప్రకటించుకొన్నాడు. తర్వాత ప్రజలకు తనిపై నమ్మకము కుదిరి, పెన్సిల్‌వేనియా రాష్ట్ర అసెంబ్లీకి అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

మేరీలాండ్‌కి చెందిన ఛార్లెస్‌కరోల్, ఫ్రాంక్లిన్‌తో 1776 లో కెనడాకు సహృద్భావ రాయబారవర్గ ప్రతినిధిగా వెళ్ళాడు. అది ఏనాటి మాట ? 1776 వసంతకాలంలో ? ఇప్పుడా ఛార్లెస్ కరోల్ 90 సంవత్సరాల వ్యక్తి. అమెరికాలోని మొట్టమొదటి రైలు మార్గం వేసే కృషిలో నిమగ్నుడై వున్నాడు. జనరల్ బెనడిక్ట్ ఆర్నాల్డ్ పోరాటం నిష్ప్రయోజనమని భావించి శత్రువశమయాడు. జనరల్ ఛార్లెస్ పోరాడ నిరాకరించాడు. 'అతనిని విద్రోహిగా భావించి సైనిక న్యాయ స్థానము శిక్షించింది.

ఫ్రెంచి విప్లవములో పాల్గొన్న టామ్‌పెయిన్ వురిశిక్షకు గురిఅయి, మరణించవలసిందే కాని కొద్దిలో తప్పి పోయింది.

మూడవ జార్జి తన అమెరికన్ వలసలను పోగొట్టుకున్నాడు. 1812 యుద్ధములో ఓడిపోయాడు. అతని మనసు చెడిపోయింది. బ్రిటిష్ సేనలు వెల్లింగడన్ నాయకత్వాన నెపోలి యన్‌ని వాటర్‌లూవద్ద వోడించాయి. ఎనభై ఒకటో ఏట మరణించేదాకా మూడవ జార్జి తన బ్రిటిష్ సామ్రా జ్యాన్ని యథేచ్ఛగా పరిపాలించాడు.

ఇక మితభాషి అయిన సైన్యా ధ్యక్షుడు జార్జి వాషింగ్టన్, యుద్ధ తంత్రములో ఆరితేరిన నిపుణుడై, యువకులకీ, సైనికులకీ ఆరాధ్య

డయాడు. అతని సైనిక వ్యూహాలను యుద్ధశాస్త్రంలోని వారు నమూనాలుగా చదువుకోసాగారు. చరిత్ర ప్రసిద్ధి నొంది సాటిలేని సేనానాయకులలో ఒక నిగా భాసిల్లాడు జార్జి వాషింగ్టన్. జీవిత కాలంలోనే అతనిని ఒక మహా పురుష నిగా కీర్తింవారు. డాక్టర్ ఫ్రాంక్లిన్‌ని యూరప్‌లోని వారు ఆకాశంమీద మెరుపుని భూమిమీదకు పట్టుకొచ్చి నట్లూ, నియంత చేతిలోని ఖడ్గాన్ని నేల పెట్టించినట్లు భావింపసాగారు. ఎనభైనాలుగో ఏట ఆయన పరమ పదించాడు. అమెరికా స్వాతంత్ర్య పత్రము, అమెరికా సంయుక్తరాష్ట్రాల రాజ్యాంగము, ఫ్రాన్సుతో వర్తక స్నేహ ఒడంబడిక, ఇంగ్లండుతో సంధి షరతులు - ఈ నాలుగు చరిత్ర ప్రాధాన్య పత్రాలమీద సంతకము వుంచిన మహామహుడు ఈయన ఒక్కడే.

కల్పనా కథకులు సామాన్యుల చుట్టూ ఎన్నోవింతలు విచిత్రాలూ తమ అనుభూతికి అనుగుణముగా అల్లుతారు - అనేవాడు యాడమ్స్. చుట్టూ గల మహానాయకుల మధ్య తన నీడ కనపడనవసరం లేదని. యాడమ్స్ భావించేవాడు. భవిష్యత్తు ఈ వీరపురుషుల గురించి కథలు అల్లుకోవచ్చు. కాని తనకు కావలసింది వర్తమాన ప్రజాభిప్రాయము. యాభై సంవత్సరాలపాటు అమెరికన్ ప్రజలు. ఇతను ఎటువంటివాడు. ఎవరిపక్షము వాడు ? - అని అంచనాలు గడుతూనే వున్నారు. ప్రజానాయకునికి అంతకు మించిన కొలమాన మేమున్నది ? యాడమ్స్ తీరికూచుని శత్రువులను సృష్టించుకునేవాడు.

వాషింగ్టను తరువాత యాడమ్స్ అధ్యక్షుడయినపుడు - అనేకులు ఇతని ప్రాపకంకోసం ప్రాకులాడటం మొదలు పెట్టారు. ఎవరి బోధనలు, ఎవరి మాటలు వినేవాడు కాదు. ముఖ్యులని విదిలించేవాడు. ఫ్రెంచివిప్లవముజరుగు తున్నది గనక అందుకు వ్యతిరేకముగా సంచరిస్తున్న ఇంగ్లండుపై అమెరికా కూడా యుద్ధము ప్రకటింపవలసినదని సిటిజను జెనెట్ ఆందోళన లేవదీశాడు. ఆవేశపరులయిన ప్రజలు పదివేల మంది ఫిలడల్ఫియా వీధులలో ప్రదర్శన జరిపారు. ఇంత విలువైన స్వాతంత్ర్యా న్ని చనకబారు ఆవేశాలకి గురి చేయడములో గల అపాయము అతనికి తెలుసు. ఫ్రాన్సులో జరుగు తున్న అంతరంగిక విప్లవానికీ నేటి అమెరికా సమస్యలకు ఏమీ సంబంధం లేదు. కాని ఆవేశపరులైన ప్రజలకి ఈ విచక్షణ తెలియదు. తమ కోసమై నాయకుడు పడ్డ కష్టము, మహా సౌధమూ మర్చిపోతారు. అతనిలోని లోపాలు, కఠినోక్తులూ మాత్రమే జ్ఞాపకముంచుకుంటారు.

అదే గ్రామంలోని మరొకచోట ప్రజలు పండగ చేసుకొంటున్నారు. స్వాతంత్ర్య దినోత్సవ మప్పుడే పండగ పబ్బాలలో ఒకటిగా మారి పోయింది. ఇది విందువినోదాలు జరుపుకునేందుకే తప్ప స్వాతంత్ర్య దీక్షా కంకణులమని గుర్తుకు తెచ్చుకునే

పుణ్యదినంగా లేదు. అదేదో తమ తాతముత్తాతల నాటి విషయమై పోయింది ప్రజానీకానికి. యాడమ్స్ జులై 4వ తేదీన మరణించాడు. ఆనాడు అమెరికాలో ఎందరో శౌర్య వంతులు, బుద్ధికుశలురు వుండేవారు. వారి విప్లవ యత్నం ప్రారంభములో బంధవిముక్తికోసమే అయినా సామాన్య వ్యక్తుల అల్పప్రయోజనాలకు వారు లోబడకుండా ఉత్తమగమ్యాన్ని చేరుకునేందుకు బాట వేశారు. ప్రతీ తరంలోనూ ఆనాటి సువర్ణస్వప్నాలను తిరిగీ దర్శించేందుకు, ఆనాడు వాగ్దానం చేసిన స్వాతంత్ర్యాన్ని కాపాడేందుకు ఈ దినోత్సవం జరుపబడుతున్నది.

ప్రజలందరు సమానులనీ, తాము ఎన్నుకున్న ప్రభుత్వపాలన ప్రకారము రాజ్యాన్ని నడిపించుకోగల హక్కు ప్రజలకు వున్నదనీ, ప్రజాభీష్టంతో కూడిన శాసనాలతోటీ ప్రభుత్వ పాలన సాగాలనీ, అందరికీ సమానావకాశాలు, సమానన్యాయము అందజేయాలనీ, ఆ మహనీయులు ఉదాత్తలక్ష్యాలతో మానవాళికి ఒక దీపిక అందించారు. అదే స్వాతంత్ర్య పత్రం. ఆ పత్రానికి ప్రాణమైన భావాంకురము ప్రజాహృదయములో సజీవంగా వుంటుంది. (సమాప్తం

—మాతృక : కార్నెల్ లెన్‌గ్వెల్

—తెలుగు : యన్నార్ చందూర్

In Telugu Literature

# *Portrayal of Youth*

"Flaming youth has become a flaming question. And youth comes to us wanting to know what we may propose to do about a society that hurts so many of them," said Franklin Roosevelt in April 1936 -fiftythree years back. We know it was the American youth that put a halt to the Vietnam war.

Coming to the portrayal of youth in Telugu literature, let me say that the modern Telugu prose commences with Gurazada Apparao, an officer in the erstwhile estate of the Maharaja of Vizianagaram. That Maharaja, Ananda Gajapati, was a connoisseur of fine arts and a great visionary and under his patronage Apparao brought new life and vigour to Telugu Literature by bringing it on to the highways and railroads—breaking the shackles of chariots and palanquins. In 1897, more than nine decades back, in his famous play KANYASULKAM he carved out a character by name Gireesam who reverberates with all the dash and cunning even today. Gireesam may be mentioned as the first youth in modern Telugu literature. He wants to rid the society of nautch-girls and encourage re-marriage to widows. His ideals are fine and progressive but the man is slippery. He is neither a villain nor a cheat but his cleverness has an edge and his capacity to befriend himself with all the sundry is laudable. And Sowjanya Rao, a gentleman to the core, sees to it, that the young window with whom this Gireesam planned to elope, does not fall into the trap. In the end Gireesam cuts a sorry figure but he has no grievance against anyone and we find in him a semi-educated youth drifting away thro' several conflicts and social forces.

Gurazada Apparao is considered a leading light and what he wrote in 1908 about the Madras Congress Session is not completely out of place. This piece appeared in the HINDU of 1908.

**'Tell me not in scornful numbers**
**Congress mpty show**
**For though many a delegate slumbers**
**Seats are full in every row.**
**Cogreess is earnest - Congress is real**
**Self - government is its goal.**

That was at a time when Gandhiji had not made his appearance on the scene.

In the portrayal of youth two famous plays had the field-day till 1930 - one was KANYASULKAM - bride-money; the other VARA VIKRAYAM groom-selling. They were predominant social evils of those days - of course even today we hear of bride-burning and dowry deaths. Kallakuri Narayana Rao who authored the play VARA VIKRAYAM, portrayed a spineless youth Basavaraju who was a tool in his father's hands. While the elder girl Kalindi for whom this groom Basavaraju is intended, commits suicide by jumping into a well, the younger one Kamala willingly marries the man to teach them a lesson and goes into litigation, claiming that they have purchased him for such and such an amount and produces the dowry receipt in the court to the consternation of one and all. Here we find a bold, courageous girl out to achieve her aim in contrast to a dumb educated weakling.

From these two characters we go to Sangadas, a Harijan youth following the footsteps of his father and the Gandhian ideals, in Wunnava Lakshminarayana's famous novel MALA PALLI otherwise known as SANGA VIJAYAM. The book was prescribed by the British India Government and the ban was lifted only when the provincial Congress Governments were formed in 1937. It was published by that fearless freedom-fighter Kasinadhuni Nageswara Rao Pantulu.

Sangadas is the second son of Ramadas, a Vaishnavite Harijan, who leads a pious life cultivating his own land. While the elder son Venkataswami helps the father in agricultural work, the younger one Sangadas joins school in the nearby town. Landlord's son Ramanayudu also studies in the same school and the two boys become friendly. They start sharing their ideas and as they grow in years they come still closer. Difference in caste and social strata is no bar to their friendship that strengthens in their common desire to serve the have-nots and the down - trodden. The Landlord is unhappy about his son's attitude and being unable to check his son, thinks of liquidating the Harijan youth. That he does without any compunction by breaking the

young man's head with a sharp iron rod. The Harijans, instead of burning the land-lord's house or taking him to task, ask for that piece of land where the youth fell down in a pool of blood, to be donated for the construction of a mandir in memory of the departed Sangadas. To escape from the wrath of the community for his heinous crime, the landlord donates the land most willingly but that small mandir turns out to be a temple of resentment and resistance to the old order, ushering in a new one. Here we find a dynamic young man sacrificing himself to the ideals of Social Justice.

As Housemen said in his famous poem :

**"When I was one - and - twenty**
**I heard a wise man say**
**Give crowns and pounds and guineas**
**But not your heart away. . "**

And Sangadas gave away his heart to the ideal he believed in.

Gurazada's Gireesam was too articulate and pompous in speech but undependable in action. And Kallakuri's Basavaraju was a nincompoop with no will of his own. And in Sangadas we find a young man full of dedication to a cause, imbued with a spirit of sacrifice.

In the forties and fifties and to some extent in sixties as well, we find the portrayal of youth from a different angle. The Second World War and the changing fabric of the society have an impact on life and literature.

**"When all the world is young, lad**
**And all the trees are green**
**And every goose a swan, lad**
**And every lass a queen"**

. Those are lines from Charles Kingsley. And that sort of yearning has gone. While Romanticism strove for higher values in aesthetics, Progressive Writers have come face - to - face with Social Reality and they etched out characters that are nearer to the common man and the youth of this period has the problem of unemployment, hunger, security and mental accommodation. Venkatachalam, Kutumba Rao, Gopichand, Butchibabu, Padmaraju and a number of others have come to the field of writing, with periodicals becoming popular. Padmaraju had the unique distinction of being the first Indian to bag the second prize of the New York Herald Tribune's world - wide short story contest. That was some thiry years back.

While Venkatachelam fought for the emancipation of women thro' his powerful pen, Kutumbarao portrayed the youth and the contemporary social scene in all its grimness and stark reality. 'Knowledge is of two kinds - one is bookish and the other is by way of experience. What we mean by Education is the synthesis of the two' observes Kutumba Rao, who has created a non-hero Sundaram, as the central character of his famous novel CHADUVU. Those who courted imprisonment in 1921 are not that keen for the Civil Disobedience Movement of 1930. World Economic Depression has affected the life-pattern of middle class in small towns and nearby villages. When young Sundaram enthusiastically offers to go to jail as a patriot, his father-in-law admonishes him: "We of the earlier generation, are already committed to this Jail Yatra. Think of your wife and child and your future."

Sundaram is non-plussed. "Isn't this national struggle a part of our sacred duty?". There is no one to give him a satisfying answer. He goes to Benares Hindu University to prosecute his studies. ... "Along with Gandhiji's moral force, we should have the physical force as well to eject the British." Those are the murmurings heard. And Sundaram sees in the early thirties, the hired volunteers dissuading the students from entering the campus. Madan Mohan Malaviya who has given priority to education in preference to politics gets dismayed and ultimately the University is closed for some time to come and Sundaram returns to his village.

Sundaram was married when quite young to a child - bride of a known family, received dowry and he has no higher aspirations or ambitions. He simply takes life as it touches him and he is perpetually worried about the conflicts that cross his path. His attachment to his wife Lakshmi is never on a romantic plane - she is just an ordinary housewife that looks after him in the age-old traditional manner - not a companion with whom he can share his thoughts and feelings.

This novel starts with the Aksharabhyasam of Sundaram and ends up with the Aksharabhyasam of Sundaram's son and Sundaram by that

time is less than twentyfive. He is not a frustrated man but groping his way.

Gopichand has depicated a typical trio in Kumar, Tilakam and Venkayya. On way to a Poets' Meet at Madras, Kumar breaks journey at a wayside station, just to find out how his one-time college-mate and admirer is faring in this small place. Her husband, Comrade Kumar Venkayya, insists upon staying at least for four days. And in these four days, Tilakam finds more substance in her husband's activity than Kumar's poetical yearnings that appear meaningless sentimentality. In Tilakam we find a new educated girl who can learn for herself what is good and progressive to her and to the society.

I have mentioned just a few outstanding names but there are scores of writers who have depicted different aspects of modern youth. Rampant corruption, severe unemployment, lack of opportunities on several flimsy grounds of caste and reservation, the ignorance of merit, the interference of people at high places - these and many more have aroused a sense of dissatisfaction and disillusionment in youth. In the later sixties and seventies, the postgraduate centres at Visakhapatnam and Warangal have turned out to be hot-heds of revolt - some silent, some violent. The youth is unable to accept the injustice meted out to them and to the society at large and these things are portrayed in a number of poems, short stories and novels. Unable to find a healthy, outlet, the spirit of adventure is turning out to be restlessness and frustration.

In the stories of Kalipatnam Rama Rao, Chaganti Tulasi, Namini, Vasireddi Seeta Devi, Madhurantakam Rajaram, Puranam and a host of others, we find the youth depicted with optimism and positive urge. Let me conclude with the lines of Wordsworth:

**"There was a time when meadow grove, and stream**
**The earth, and every common sight**
**To me did seem**
**Apparelled in celestial light**
**The glory and freshness of a dream"**

And Byron says 'The days of our youth are the days of our glory'... And that glory and that freshness are the treasure of youth.

**—N R CHENDUR**

**(Paper Read at the South Zone Cultural Centre, Thanjavur on Oct. 4, 1989)**

## సమీక్షలు చిత్రజగ

### 'సుమంగళి'

హిస్టరీ ప్రొఫెసరుని (కృష్ణంరాజు) అరుగురు రౌడీలు వలయాకారంతో చుట్టుముట్టగా, ఆ ప్రొఫెసరుగారు రెబెల్ స్టార్‌కి ఉండవలసిన వీరోచిత లక్షణంతో వారిని దుమ్ము దులుపుతాడు. ఆ తర్వాత క్లాసులోకి విద్యార్థినీ విద్యార్థులందరూ మాస్క్‌స్ ధరించి వికృతాకారాలతో రాగా, ఈయన యిచ్చిన పది నిమిషాల వ్యవధిలో, అందరూ ముఖం తొడుగులు తీసేస్తారు - ఒక్క దివ్య (కల్పన) తప్ప! ఆజానబాహువు, అరవింద దళాయతేక్షుడూ అయిన సీనియర్ హీరో (జూనియర్ శ్రీరామ్ కుమార్) దివ్య చెంప ఛెళ్ళ మనిపించడంతో, ఆమెకళ్ళు తెరుపులకి వస్తాయి. తత్కారణంగా మర్నాడు సమ్మె జరిగినా అది దూది పింజెలా తేలిపోతుంది. జూనియర్ హీరో దివ్య యింటికి వచ్చి, ఈసారి జరిపే సమ్మెలో నీవుగాని పాల్గొనక విఫలం చేశావా, నలుగురిలో నీ బట్టలు వొలిచి ఆట వెలదిని చేస్తాను - అని బెదిరిస్తాడు. ఈ మాటలు విన్న దివ్య తల్లి సీత (జయప్రద) ఆ యువకుని చెంప ఛెళ్లుమనిపిస్తుంది.... ఆ తల్లి అసలు తల్లికాదు - పెంచుతున్న తల్లి; తను నిజమాతను కాదనే విషయం కూతురుకి తెలియకూడదని ఆపసిదాని ఆరోఏటనుంచీ కుంకుమ చెరిపేసుకు, తెల్లబట్టలే ధరిస్తూ వుంటుందామె. తను సంతానవతి కాలేకపోయినందుకు, భర్తని వొదిలి వెళ్లిపోయిన సీత తిరిగీ తన ప్రాణనాధుని కలుసుకోవడం ఇందులోని ప్రధాన యితివృత్తం. దర్శకత్వం; విజయ బాపినీడు. నిర్మాత: సారధి.

### మెట్రో ఫిలిమ్ కార్పొరేషన్ 'ఫైర్ వాకర్' (Fire Walker)

మెకన్నాస్ గోల్డ్, ది గన్స్ ఆఫ్ నవరోనే, కింగ్ సాలమన్స్ మైన్స్, టెన్ టు మిడ్‌నైట్ వంటి చిత్రాలు తీసిన దర్శకుడు లి - తామ్సన్ 'నిప్పులో నడిచే మనిషి' కథ వెండితెరకెక్కించాడు. ప్రాణాలకు తెగించి, సాహసమే ఊపిరిగా మాక్స్ (శ్వేత వర్ణుడు), లియో (బ్లాక్) సాయంతో, పెట్రిషియా అనే అందగత్తె యిచ్చిన పటం ఆధారంగా మధ్య అమెరికా అడవుల్లో, భూస్థాపితమై వున్న

బంగారునగలూ, రత్నాభరణాలకోసం ప్రమాదకరమైన వేట ప్రారంభిస్తాడు. నేటివులకి చిక్కి, వారి వింత ఆచారాలు పాటించి, ఒక తెగ నాయకుని అభిమానం సంపాదించి, ముందుకి సాగుతాడు. అవాస్తవికంగా అక్కడక్కడ కనిపించినా, ఇది యాక్షన్ థ్రిల్లర్ అవడం చేత వాటిని అంతగా పట్టించుకోనవసరం లేదు. మగవారికి ఏవిధంగానూ తీసిపోకుండా, పెట్రీషియా చూపిన సాహసం ప్రేక్షకులని మెప్పిస్తుంది. చివరికి అయిదు గోనె బస్తాలతో సువర్ణా భరణాలని, వజ్రాలని మోసుకుంటూ బయటికొచ్చి, పడవ మీద దగ్గర ఊరుచేరుకొనేసరికి, ఎడారిలో తమని కొయ్యలకి కట్టి పడేసిన విలన్, హొటల్ బట్లర్‌గా ప్రత్యక్షమవుతాడు – వెనకటివి మర్చిపొమ్మని ఆర్డిస్తూ! ఈ యడ్వంచర్ చిత్రం జయప్రదా ధియేటర్లో (మద్రాసు) రిలీజయింది .... పి ఆర్ ఓ : టియమ్ రామన్.

## వియమ్‌సి విడుదల 'లక్కీ సెవెన్' (Lucky Seven)

'స్వప్నగీత్'లో దిగగానే ప్రమోద్ కుమార్, దొరైస్వామిరాజు కనిపించారు. 'సౌత్‌కి డిస్ట్రిబ్యూషన్ తీసుకున్నాను' – అన్నారు వియమ్‌సి అధినేత. కంగ్రాట్స్‌చెప్పాక, కబుర్లలో పడిపోయాము.... మద్రాసులోని అలంకార్‌లోను, శక్తి అభిరామిలోను ఈపిక్చర్ రిలీజవుతోంది .... 2 లక్షల అప్లికేషనులలో 900మంది అభ్యర్థులని ఎన్నికచేసి, ఇంటర్‌వ్యూకి వారిని హాంగ్‌కాంగ్ నగరానికి పిలిపించి, ఆ తొమ్మిదివందలలో ఏడుగురిని ఎన్నిక చేశారు. ఈ 'లక్కీ సెవెన్' కుటుంబంలోని యావన్మందినీ హాయిగా నవ్విస్తారు ; ఆనందింపజేస్తారు. 'రాంబో' అనే కమాండో కిడ్ అమెరికానుంచి హాంగ్‌కాంగ్ విమానాశ్రయంలోదిగి, తన వయసుపిల్లలు అయిదుగురికి లీడరైన జూడీని కలుసుకుంటాడు. మొత్తం ఈ ఏడుగురూ హొటల్‌కెళ్తారు - తమకు కావల్సినవి ఆర్డరిస్తారు. .... హెలెనూ, ఆమె మిత్రుడూ గాంగ్‌స్టర్స్‌కి వజ్రం యిచ్చి, బ్రీఫ్‌కేసు నిండా నోట్లకట్టలు పుచ్చుకుంటూన్నదృశ్యం వారి కంటపడుతుంది. అనుకోని గలాభాలో వజ్రంతో పారిపోతారు హెలెనూ, ఆమె మనిషి. 'లక్కీ సెవెన్' నేరపరిశోధన ప్రారంభించి, గాంగ్‌స్టర్స్ వల్ల కాల్చబడిన ఆ మనిషి వద్దనుంచి, ఆ వజ్రం పుచ్చుకు, కోటుకి గులాబీపువ్వు, మోకాలుపైన తెల్లమచ్చగల యువతికి ఆవజ్రం అందజేసే ప్రయత్నంలో, క్రిమినల్ గాంగ్‌ని ముప్పతిప్పలూ పెట్టి ఆటకట్టిస్తారు. దర్శకత్వం ; చివ్ - చున్ - క్వాక్.... పిఆర్ఓ : టియమ్ రామన్.

---

చరిత్ర పత్రాలలోని పన్నెండుగురు గొప్పవాళ్లలో పదకొండుగురు ఏదో ఒక మహదాశయపు ప్రతినిధులు.

—నిషి

## పద్మబాలా వారి
## 'హడల గొట్టండి'
## (Shoot at the Devil)

విల్‌బర్‌స్మిత్‌ది (Wilbur Smith) అదేపేరు నవల ఆధారంగా, మైకేల్ క్లింగర్ (Michael Klinger) నిర్మించాడు ఈచిత్రం. దర్శకత్వం: పీటర్ హంట్ (Peter Hunt) ... ఏనుగు దంతాలకోసం ఫ్లిన్ అనే డబ్‌మాన్ (వయసులో పెద్దవాడు), సెబాస్టియన్ అనే అంగ్లయువకుని నేర్పుగా వుచ్చులో బిగించి, జర్మన్ అజమాయిషీలో వున్న తూర్పుఆఫ్రికాలోకి పట్టుకొస్తాడు. అక్కడి అడవులలో ఏనుగులని నిర్దాక్షిణ్యంగా వేటాడి, వాటి దంతాలు పోగుచేసి, విదేశాలలో అమ్మి కోటీశ్వరులు కావచ్చు. తమ వలసలోని ఏనుగులని కాల్చడం అక్కడి కమీషనర్ ఫ్లెచర్‌కి ఆగ్రహకారణమవుతుంది. ఇదంతా 1913లో జరిగిన గాథ - మొదటిప్రపంచ యుద్ధానికి పూర్వం! సెబాస్టియన్ ఫ్లిన్‌లని తరిమికొడతాడు ఫ్లెచర్ - ఫ్లిన్ కూతురు రోజా, సెబాస్టియన్ని ప్రేమిస్తుంది. వారిద్దరికీ పెళ్ళి అవుతుంది - ఒక ఆడపిల్ల కలుగుతుంది. అయితే, మామా అల్లుళ్ళకు ఏనుగు దంతాల ఆశ మాత్రం వొదలదు. మళ్ళీ వేట మొదలెడతారు - ఈసారి ఫ్లెచర్ మొత్తం గ్రామాన్నే కాల్చివేసి, రోజాకి కలిగిన పసిదాన్ని చంపివేస్తాడు. నెమ్మదిగా ఏనుగు దంతాల విషయం వెనకబడి, ఇద్దరిమధ్యా కక్షతయారై, బలాబలాల పోటీ ప్రారంభమవుతుంది. యుద్ధనౌకలో బందీగా చిక్కిన రోజాని సెబాస్టియన్ కాపాడగా, ఆ నౌకలో గుప్తంగా ఉంచిన బాంబుతోపాటు ఫ్లిన్ మరణిస్తాడు. పట్టువిడవని ఫ్లెచర్ చివరికి సెబాస్టియన్ తుపాకీగుండుకి గురవుతాడు. .... దురాశ మనుషుల్ని మృగాలుగా మార్చడం, స్వీయరక్షణ కోసం ప్రాణాలకు తెగించి పోరాడటం ఈపిక్చర్లో చూస్తాం. ఫొటోగ్రఫీ చాలా బావుంది. 76 ఏళ్ళక్రితం ఆఫ్రికాలో శ్వేత జాతీయులు ఎలా మసులుకొనేవారో లీలగా బోధపడుతుంది....

పిఆర్ఒ: టియమ్ రామన్

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

రచయిత కాదలుచుకున్నవాడు అరిస్టాటిల్ సలహా పాటించడం ఎంతైనా అవసరం - మేధావుల పద్ధతిలో ఆలోచించి, సామాన్యుల భాషలో చెప్పగలగాలి.

—యీట్స్

మూర్ఖులకి వివేకం బోధించడం వృథాశ్రమ - బొగ్గుని ఎంత కడిగినా తెల్లబడదు.

—కబీరు

నింద వేయడం అబద్ధం చెప్పడం కంటె ఘోరం - అది అబద్ధాన్ని దాచే బురఖా.

—పోప్

గొప్పదన మెప్పుడూ నిరాడంబరతని పోలివుంటుంది - ఈ రెండిటి మధ్యాగల దూరం అతిస్వల్పం.

—ఎమర్సన్

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీ జనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువలేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు. ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పరతతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవిత విశేషాలు, ఆనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - జులై నెల నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

రెండుమూడు దినములు ఈ కొండచుట్టూ జనము, పశువులు, అంగళ్లు కిటకిట లాడుచుండును. బిచ్చగాండ్రును విచ్చలవిడిగా వత్తురు. ఈ మహోత్సవము చూచుటకై అధికారులును ఆరోజులలో అచ్చట క్యాంపులు వేసుకొందురు. అక్కడికి వచ్చి-జనులు పాకలలోను, చెట్లక్రిందను దిగి వంటలు చేసుకొనెదరు. సర్కారువారున్ను వచ్చినవారికి సౌకర్యములొనర్చి, పోలీసు బందోబస్తు గావింతురు.

ఈ ఉత్సవములకు ప్రభలవెంటను, విడిగాను ఆ చుట్టుప్రక్కల గల స్త్రీలును విస్తారముగ వత్తురు. ఆప్రాంతమున విస్తారముగ మెట్టవ్యవసాయము. పురుషులతోపాటు అచ్చట స్త్రీలును పొలములలో పాటుపడ నేర్చినవారు. పల్నాడు ఇచ్చటకి సమీప ప్రదేశము. పల్నాటి సీమనుగూర్చి శ్రీనాథుడు చెప్పిన చాటు పద్యములు కనుడు:—

రసికుడు పోవడు పల్నాడెసగంగా రంభయైన యేకులె వడుకున్
వసుధీశుడైన దున్నును కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.
చిన్నచిన్నరాళ్లు చిల్లరదేవుళ్లు నాగులేటినీళ్లు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.
జొన్నకలి జొన్నయంబలి జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ పన్నుగ పల్నాటి సీమ ప్రజలందరికిన్.

ఇట్టి ప్రదేశముల స్త్రీలును స్వేచ్ఛా స్వాతంత్ర్యములుకల్గి, ధైర్య సాహసములతో పౌరుషవంతులై యుందురు. చూపునకును వడ్డుపొడుగుకల్గి, దేహపుష్టి, ఆరోగ్యముకల్గి, కంటికింపుగా నుందురు. వారు ముతకకోకలను చుంగులు తీర్చికట్టి, వెండిమురుగులు ముక్కరలు, గూబావిలీలు, చెంపసరాలు మొదలైన పురాతనపు నగలతో అలంకరించుకొని కాటుకకండ్లతో, కడవలంతేసి వంకకొప్పులతో వత్తురు. అమాయకులైన ఈ స్త్రీలు తాంబూలము ఘూడించుచు మధ్య మధ్య పండినదా లేదా యని నాలుక ప్రక్కకుజాపి క్రీగంట చూచుకొనుచు ఉత్సవముల తిలకించుచుందురు.

కొన్ని సంవత్సరముల క్రితము ఇచ్చట ఈ తిరునాళ్లకు ప్రభలుకట్టుకొని వచ్చిన రైతులకును, సర్కారు ఉద్యోగస్థులకును గట్టిపోరాటముజర్గి తుపాకులనుగూడ ప్రేల్చవలసి వచ్చినది. ఈపోరాటము కేసు కోర్టుకెక్కి కొందరు శిక్షింపబడిరి. తగిన బందోబస్తు చేయలేదనియు, సకాలమున విధి నిర్వహింపక దాగిరనియు కొందరు ఉద్యోగస్థులను తీసి వేయుటయు జరిగెను.

ఆ గాథనుగూర్చి నాటిరోజులలో నిట్లుచెప్పుకొనిరి. చెన్నప్పరెడ్డియని ఆ ప్రాంతమున ఆరోజులలో మోతుబరి. అతనిగూర్చియే పామరులు, బిచ్చగాండ్రు, నేటికిని

'రాజా చెన్నాపారెడ్డి నీపేరే బంగారపాకడ్డీ'

అని పాటలు పాడుచుందురు. ఇతని సాహసముల గూర్చి ఎన్నియో కథలు చెప్పుదురు. ఇతడేదో మ్రొక్కుబడియుండి ప్రభకట్టుకొని కోటప్ప కొండకు నడిచినాడట. ప్రభ వెంట ఇతని సోదరియు వచ్చినదట. చెన్నప్ప రెడ్డి ప్రభబండికి పూన్చిన ఎద్దులు పొగరు గ్రక్కుతూ నడుస్తున్నవి. నొగల కూర్చొని తోలువాడు, ప్రక్కతాళ్లబట్టి అదలించి నిగ్రహించువారు జాగ్రత్తగా నడిపిస్తున్నారు. కొండపైకి కొంతదూరమున-కేగిన మీదట ఆ ఎద్దులలో నొకటి జనసమూహమును చూచి కొంత మొరకు చేయుచున్నది. పోలీసు భటులు అధార్టీ చేయవచ్చిరి. మీరు కలుగ జేసుకోవద్దు; మేము సమాళిస్తాము అని ఆ ఎడ్లమచ్చిక తెలిసిన రైతులనుచున్నను, ఆ పోలీసులలో నొకడు వినిపించుకొనక తన లాటీకర్రతో ఆ ఎద్దును పొడిచెను. అది రెచ్చిపోయినది, కలియద్రొక్కుచున్నది. అయినను ఆ రైతులు దానిని కొంత శ్రమపడి, సమాళించ గల్గువారే. కాని పోలీసు శాఖ వారికా ఓర్పు నేర్పు లేకపోయినది. రైతులందరు—వద్దు వద్దు అని అదలిస్తున్నా వినిపించుకోక వారు ఆ ఎద్దుపై తుపాకీని ప్రేల్చిరి. రైతుల కుద్రేకముకలినది. చూస్తారేమిరా, మీసాలు గల మొగవాళ్లు అని గర్జించి చెన్నప్పరెడ్డి సోదరి కోక విరిచికట్టి గండ్రగొడ్డలి తీసికొని ముందు కురికినది. ఎర్రటోపీగల (నాడుపోలీసులకు తెల్లదిరుసు, ఎర్రటోపీలు) తల ఎల్లా ఎగిరిపోయినది. భూమిపై 'ఇంకా గింజలుగల' పోలీసులంతా, తమయూనిఫారములు, టోపీలు తీసి పారేశారు. అధికార్లు చాలమంది అధికారచిహ్నములను జారవిడిచారు. నామాలుపెట్టుకొని దాసరులు బూడిదపూసుకొని జంగాలు అయి, నాటికి ప్రజా సామాన్యంలో కలిసి ప్రాణం దక్కించుకున్నారు. నిజంగా ఆనాడు కోటప్పకొండమీద చెన్నప్పరెడ్డి ప్రభ ముందు రక్తపువాగులే పారినవి.

తమ బిడ్డలనువలె కంచములో అన్నము నోటికి కబళమందిచ్చి పెంచు కొనే ఎడ్లనుగాసిపెట్టితే గుంటూరి రైతులు, అందును పల్నాటివారు సహించరు. 1921-22లలో సహాయనిరాకరణపు గొడవలప్పుడు పోలీసులు జప్తుకువచ్చిరి. కన్నెగంటి హనుమంతు అనువాని ఎద్దులను జప్తుచేయదలచిరి. అతడు కాదనెను. ఆ గందరగోళములో ఆతడు పోలీసుల తుపాకికి గురియై చచ్చెనేగాని, బతికియుండగా తన ఎద్దును పట్టనివ్వలేదు.

## శివరాత్రి ఫలహారములు

నా చిన్ననాడు మా ఊరిలో ముఖ్యముగ ముందు ముత్తైదువులు పూర్వసువాసినీలు ఉలవగుగ్గిళ్లు, జొన్నపేలాలు, పేలపిండి, భుజించి శివ రాత్రినాడు జాగరణ సలుపుచుండిరి. ఈజొన్నపేలాలకు ఎర్రటి కొరివి కారమును పట్టించి భుజించెదరు. పేలపిండిలో పెరుగుకలిపి త్రాగెదరు. ఉలవగుగ్గిళ్లలో పచ్చిమిరపకాయలను కొరుకుతూ తినుచుండిరి. కొందరు సొజ్జ రొట్టెలను, తప్పెలబిళ్లలను, కాల్చి ఫలహారమును చేయుచుండిరి. ఈకటికి ఉపవాసములతో రాత్రిళ్లు జంగముకథలు, లక్ష్మణమూర్చ, శీతమ్మ కడగండ్లు.. విని జాగరణ చేయుచుండిరి. మరికొందరు అచ్చనగండ్లు, గవ్వలాటలతోను, మరికొందరు చీలిజగడాలతోను రాత్రిఅంతయు ప్రొద్దుపుచ్చుదురు. తెల్లవారగనే యేటిలో స్నానముచేసి, వంటకములను తయారుచేసుకొని, బ్రాహ్మణునికి ఔపోసన వేసి, పారణ ముగించెదరు. మరుసటిదినము మొదలు కొందరు అజీర్ణవిరోచనములతో శివరాత్రిఫలమును ప్రత్యక్షముగా ననుభవించుచుండిరి.

## మావూరి రంగిరేజులు

రంగిరేజులనగా గుడ్డలకురంగు వేయువారు. వీరు రంగులతో గండ భేరుండకోట కొమ్మంచులను చీరలకు ధోవతులకు అంచుగట్టి అద్దుచుండిరి. ఒకచుక్క, మూడు చుక్కలు, అయిదుచుక్కలతో చుక్కల చీరెల నద్దుచుండిరి. ముదురు బెంగావి, పాలబెంగావి, చుట్టుబెంగాని చీరెలను అద్దుచుండిరి. గువ్వకన్ను, నెమలికన్ను చీరెలనద్దుచుండిరి. ఈ రంగులన్నియు గట్టిచాయ లని పేరు. గుడ్డచినుగు వరకు రంగులుపోవు. ఆ కాలమున మన దేశమున లభించు కరక్కాయ, నీలిమందు, చిరివేరు, పబ్బాకు, మంజిష్ఠ మొదలగు వనమూలికలతో రంగులు వేయుచుండిరి. ఈ పరిశ్రమకు మా ఊరున్నూ (ఇనమన మెళ్లూరు) గొల్లపాలెం, బందరు, చీరాల, కరేడు, నెల్లూరు ఆరోజు లలో మిక్కిలి ప్రసిద్ధి వహించియుండెను. చెన్నపట్నం ప్రక్కనయుండే సైదా పేటలో కూడ ఈ రంగులను వేయుచుండిరి. ఈ పరిశ్రమ క్రమముగా నశించిపోయినది. విదేశీ కృత్రిమపురంగులు వచ్చి మనమూలికల సంబంధమగు రంగుల పరిశ్రమను ఎట్లు ధ్వంసమొనర్చినదియు, కీ॥ శే॥ ఆచార్య ప్రఫుల్ల చంద్రరాయిగారును, ఆనంద కుమారస్వామిగారును విశేషముగా వ్రాసి యున్నారు. బందరులో తయారుచేసిన రంగు చీరెలను మద్రాసు పచ్చయప్ప కళాశాల ప్రక్కనయుండు వీధిలో అమ్ముచుండిరి. అందువలన ఆ వీధికి బందరు

వీధి అని పేరుకలిగెను. ఆ వీధికి మునిసిపాలిటీపేరు గురువప్పవీధి యని బోర్డుయుండినను వాడుక బందరువీధి యనియే పేరు. ఈ వీధిలో ముందు అరటిపండ్లను విస్తారముగ విక్రయించు చుండినందున అరటిపండ్ల వీధిఅనికూడా పేరు కలదు. ఈ వీధిలో నేను చిన్నతనమున చదువుకొనుచుంటిని. పిమ్మట కేసరికుటీరము కూడ ఈ వీధిలో చాలాకాలముండెను.

## మావూరిలో కోళ్లపందెములు

మా ప్రాంతాన సంక్రాంతి పండుగను పెద్దపండుగ అందురు. అప్పుడు వ్యవసాయపు పనులు కొంచము తక్కువ. భోగి, సంక్రాంతి, కనుమ, ముక్కనుమ వరుసగా పండుగ రోజులు. ఆరోజులలో గ్రామస్థులు ఆటపాటల ప్రొద్దుపుచ్చెదురు. అందులో పెద్దపండుగరోజున మా వూరి రంగిరీజులు యేటివడ్డునయున్న చింతతోపు లోనికిపోయి కోడిపందెముల నాడేవారు. మంచి కోడిపుంజులను ఈ పండుగకొరకు ప్రత్యేకముగ పెంచి యుంచేవారు. వీటిని ఆ తోపులోనికి తీసుకొనిపోయి, వాటికాళ్లకు సన్నని కత్తులును గట్టి రెండు పుంజులను డీకొలిపి విడిచెదరు. అవి రెండును ముందు వెనుకలకు నడుచుచు ఎగురుచు కత్తులను గట్టిన కాళ్లతో రొమ్ములపై తన్నుకొనుచు పోరాడును. రక్తము ధారగ కారుచున్నను అవి పోరాటమును విడువవు. ఈ ప్రకారము పోరి కొంత సేపటికి యొకకోడి క్రింద కూలును. గెల్చినవాడు చచ్చినకోడిని తీసుకొనిపోయి రాత్రికి విందు భోజనమును చేయును. ఇది పల్లెటూర్ల పండుగ సంబరము. నాటికి సంబరమేగాని - కోడి పందెముల పగలు సామాన్యముగా నాటితో చావవు, పోరాటము సాగుచున్నప్పుడు చూచువారు రెండు కక్షలై పౌరుషపు మాటలతో ఆయా పుంజులను రెచ్చగొట్టి హుషా రిచ్చుచుందురు. కోడిపుంజులును నైజముగనే రోషముతో పోరుచుండును. నిజముని కీ మాటల వల్ల రోషమెక్కుచున్నది ఇరు కక్షలకు. పండుగసంబరమున కొంచెము మత్తు పదార్థములు పుచ్చుకొని, అసలే హుషారుగానున్న ఆ గ్రామస్థులు ఈ రోషపుమాటలతో తామసము వహింతురు. పైగా ఆ కోళ్లపై కొందరు పదులు, నూర్లు పందెములు కాయుదురు. వానిని ధారపోసు కొన్నప్పుడు ఈ తామసము మించిపోవును. దానితో వారు కలియపడి కొట్టుకొనుటయు కద్దు. లేదా సంవత్సరము పొడవున కక్షలు పెంచుకొని అప్పుడప్పుడు కొట్లాడు కొనుటయు కలదు. ప్రసిద్ధిచెందిన పల్నాటి వీరయుద్ధమునకు మూలము "కోడి పుంజుల పందెమే" యని చరిత్రకారులు చెప్పుదురు. సామాన్య జనమునకు ఇవి సరదాగా నున్నను సౌమ్యులు వీనిని రేసుకోర్సులను వలెనే ప్రోత్సహింపరు.

## కోలాటము

మా వూరి రంగిరీజులలో కొందరు మంచి కోలాటపు పాటలు నేర్చిన వారును గలరు. అప్పుడప్పుడు పెద్ద గుంపుగ కూడి ఒక దీప (గరుడ) స్తంభమున వెలిగించి దాని చుట్టు వీరు చేరి కోలాటమును వేయుచుందురు. లయ తప్పక కర్ర దెబ్బలను గట్టిగ వేయుచు, ఎగురుచు, దూకుచు, తిరుగుచు, ఇప్పటి స్కూళ్లలో ఆడ పిల్లకాయలు కోలాటము జడను అల్లు విధముగ ఆడుదురు. వీరు మొదట

'శివ శివమూర్తివి గణనాధా! — నీవు —
శివుని కుమారుడవు! — గణనాధా!'

అను ప్రార్ధన పాటతో కోలాటం ప్రారంభింతురు. ఆ పిమ్మట

'కోలు కోలన్న కోలో, నా సామి
కొమ్మలిద్దరు మంచి జోడు'

అనే పాటను పాడుదురు

## జంగము కథలు

ఆ కాలమున పల్లెటూళ్లలో జంగము కథలను చెప్పుచుండేవారు. ముఖ్యముగ బాలనాగమ్మ కథ, బొబ్బిలికథ, దేశింగు రాజు కథ, కాంభోజి రాజు కథ మొదలైన వానిని జంగములు చెప్పుచుందురు. ఆ రోజులలో ఈ కథలను చాల చాకచక్యముగ చెప్పగలిన వారుండిరి. ముఖ్యముగ మా గ్రామ సమీపమున గల ధేనువుకొండ గ్రామమున ధేనువుకొండ వెంకయ్యగారను ప్రసిద్ధమగు సంగీత పాటకులు వాగ్గేయకారులు ఉండేవారు. ఆయన జంగం కథలను స్వయముగ వ్రాసి, తాను ప్రక్కన నిలిచి, లయ తప్పక అడుగు వేయుచు, శిష్యులకు నేర్పేవారు. ఆ శిష్య పరంపర నేటికిని ఆ ప్రాంతమున కలదు. ఈ జంగం కథలు చెప్పునప్పు కథలో ఆయా పట్టులకు తగినట్లు రసముట్టిపడ, హుంకరింపులు, పాదఘట్టనములు, హెచ్చరికలు, మున్నగువాని నొనర్చుచు, ముందు వెనుకలకు లయ తప్పక నడుచుచు, దుముకుచు, భుజమున పెట్టుకొన్న తంబురను కుడిచేతి వ్రేళ్ల మీటుచు, ఎడమచేతి వ్రేళ్లకు పెట్టుకొన్న బోలు కంచు ఉంగరములతో తంబురకుండపై దరువు వేయుచు పాట పాడుచు నొకడు కథ నడుపుచుండును. అతని కిరువంకల ఇద్దరు గుంసీలు

తీసుకొని వాయించుచు, వంతు పాట పాడుచు అతనితో నడుచుచుందురు. పాట మధ్య మధ్య నిల్పుచు, ఆ వంతు పాటగాండ్రిరువురు ప్రశ్నోత్తరములలో కథను వ్యాఖ్యాన మొనర్చుచుందురు. ఈ సందర్భముననే వారు హాస్యమును చెప్పుదురు. అయితే సామాన్యముగా నిది మోట హాస్యముగా నుండును. పైన చెప్పిన పండితుల వద్ద స్వయముగా తర్ఫీదైనవారి హాస్యము పండిత సమ్మతమై సభ్యముగా నుండును. అసలు జంగము కథారచనా విధానమే రసవంతమైనది. కీ॥ శే॥ వేదము వేంకట్రాయ శాస్త్రులవారు బొబ్బిలికథ పద్యకావ్యములుకన్న జంగము కథయే రసవత్తరమని చెప్పియున్నారు. అట్టి రచనను ప్రత్యక్షముగా పాటగాండ్రు ఒకవిధమగు నాటకమాడి వినిపించి వివరించునప్పుడు శ్రోతలు తన్మయులగుదురనుట ఆశ్చర్యము గాదు. బొబ్బిలి కథను వినునప్పుడు ప్రేక్షకులు ఉద్రేకులయ్యేదరు. బాలనాగమ్మ కథను విన్న స్త్రీలు జాలి నొందెదరు. దేశింగురాజు కథలో అతని పరాక్రమమును, మహబత్ ఖానుని స్నేహమును వర్ణించి చెప్పునప్పుడు ఆ రోజులలో గల హిందూ మహమ్మదీయ సఖ్యతను తలచి, కొనియాడుదురు. ఈ జంగము కథలు యిప్పుడును ఆంధ్రదేశమున జరుగుచునే యున్నవని తలంచెదను. ఈ జంగము కథ పద్ధతి ననుసరించి చెప్పు కథలకే ఇప్పుడు బుర్ర కథలని చెప్పు చున్నారు. నూతన రాజకీయ సాంఘిక ప్రచారములను ప్రాచీన ప్రచారక పద్ధతుల ననుసరించి జంగము కథలు, తోలు బొమ్మలాటలు, వీధి భాగ వతములు ద్వారా సలుపుట ఎంతో ఫలప్రదమని కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చిరకాలము క్రిందటనే చెప్పియున్నారు. అయితే అట్టి ప్రాచీన కళా సాంప్రదాయవేత్తల యాజమాన్యమున నీ నూతన మగు బుర్రకథ లేర్పడక పోవుటచేతనో, ఏమో, ఇవి పూర్వపు వానికి కేవలము పేలవమైన అనుకరణములని రసజ్ఞులు అనుచున్నారు.

## జమాబంది

నాకు తెలియకమునుపే మా వూరిలో (ఇనమనమెళ్లూరు) యుండిన తాలూకా కచ్చేరిని వంగవోలుకు మార్చిరి. కచ్చేరి యుండినప్పుడు మా వూరు కూడ పేరు ప్రతిష్ఠలతో యుండినదట. నేను కుఱ్ఱవాడనుగ నున్నప్పుడు మా వూరికి కలక్టర్లు సబు కలక్టర్లు మొదలగు తెల్లదొరలు జమాబందికి వచ్చుచుండిరి. జమాబంది అంటే ప్రతి సం॥మున్ను రెవిన్యూలెఖ్ఖలను తనిఖీ చేయుట. వారు మా వూరికి వచ్చుటకు ముందురోజున, వంగవోలునుండి ఒక బిళ్లబంట్రోతు గ్రామమునకు వచ్చి గ్రామకరణమగు ఇనమనమెళ్లూరి రాంభొట్లుగారినీ,

గ్రామమునసబు వాకా రామిరెడ్డిగారిని చూచి దొరగారు రేపు ఈ వూరికి మకాం వేసుకొని వచ్చుచున్నారని చెప్పును. ఈమాటను వినినవెంటనే వీరిరువురు వెట్టి వార్లను పిలిపింతురు. గ్రామనౌకర్లను పాడుపడియుండిన పాతకచ్చేరి సావడిని వూడ్చి నీళ్లు చల్లమని చెప్పుదురు. గ్రామచాకలిని దివిటీతోకూడ సావడివద్ద సిద్ధముగా నుండవలయునని వుత్తరువు చేయుదురు. కుమ్మరికి కూడ కబురు పంపుదురు. ఆ రాత్రి యంతయు కరణముగారికిని మునసబుగారికిని నిదురపట్టెడిదికాదు. తెల్లవారగనే లేచి మంగలి బాపిగాడిని పిలువనంపి క్షౌరమును చెయించుకొందురు. తప్పెటలను, తాషామార్పము లను, బూరగలను తయారుచేయుదురు. మంగల బాపిగాడిని దూదేకుల హుసేన్ సాహేబును పిలిపించి మేళమును సిద్ధము చేయమందురు. గ్రామములో పలుకుబడిగల ఆలపాటి పెదవీరాస్వామి, చినవీరాస్వామి, వెంకటస్వామి మొదలగు శెట్లకును, వాకా రామిరెడ్డి, వీరారెడ్డి, లచ్చిరెడ్డి మొదలగు రెడ్డి బృందమునకును, ఇనుమనమెళ్లూరి నల్లసుబ్బయ్య, యెఱ్ఱసుబ్బయ్య, రామ స్వామి, కృష్ణస్వామి, మీనయ్య మొదలగు నియోగులుకును, బడిపంతులు పిచ్చయ్య, నంబి వరాహాచార్యులు, తంబళి పున్నయ్య అను దేవాలయముల అర్చకులకును, వేదాధ్యయ నాది పండితోత్తములగు కొరవి, బుద్ధవరపు వార్ల కును వీరందరుకును కలక్టరురాకను తెలియపరుతురు. మా వూరిలో సుమారు 40, 50 బ్రాహ్మణ కుటుంబములుండెడివి. వైష్ణవులలో ఉప్పలవారు మంచి భూస్వాములుగ నుండిరి.

వీరందరుకూడా తెల్లవారగానే గుండ్లకమ్మయేటిలో స్నానమునుచేసి వైదిక కర్మలను తీర్చుకొని, విభూతిరేఖలతోను పంగనామములతోను పింజ బోసిన ధోవతులతోను దొరగారి దర్శనమునకు వేచియుండెదరు.

దొరగారు ఉదయమున వంగవోలులో కాఫీని పుచ్చుకొని, దొరసాని సమేతముగ రెండెద్దుల పెట్టెబండి నెక్కి, సుమారు రెండుగంటల కాలములో మా వూరు చేరేవారు. వంగవోలుకు 7 మైళ్లదూరమేగనుక 9 గంటలలోపు గనే వూరికి వచ్చేవారు. ఆనాడు వూరంతయు పిల్లజల్లలతో కోలాహలముగ నుండెడిది. ముతక చీరలతో రెడ్డిపడుచులును రంగుచీరలతో బ్రాహ్మణ ముత్తయిదువలును అక్కడ చేరేవారు.

దొరగారు వచ్చేలోపల తప్పెటలను మంటకు కాచుకొని, కాళ్లకు గజ్జె లను కట్టుకొని చిందులను త్రొక్కుచు పంచములు సిద్ధముగ నుండెదరు. బ్రాహ్మణులు మాత్రము వారికి దూరముగ నిలుచుండెదరు. మా వూరి దేవాలయ మాన్యముల ననుభవించుచుండు భోగమువారు చెదలవాడనుండి వచ్చి

ఆటపాటలను సలుపుచుండిరి. వీరిని ఆదరించి అన్నమునుపెట్టు పెద్దమనుషులు గ్రామములో చాలామంది యుండిరి. ఆనాడు మా వూరు పార్వేట పండుగ వైభవముతో నుండెడిది.

మా వూరి గ్రామకరణము తెలివిగల మంచిముసద్దీ. మంచి మేనిచాయ గలిగిన భారీవిగ్రహము. బట్టతల, బొజ్జ గలిగిన మంచిమాటకారి. ఊరి వారందరికి వీరిని చూచిన భయము భక్తియుండినది. గ్రామమునసబు నిరక్షరకుక్షి అయినను తన చేవ్రాలు వ్రాయుటకు మాత్రము నేర్చుకొని యుండెను. కలక్టరుగారు గ్రామములో ప్రవేశించుటకుపూర్వమే కరణముగారు పాతలెఖ్ఖలను సవరించుకొని, పాతదస్తరమును మార్చుకొని లెఖ్ఖల తనికీకి సిద్ధముగ నుందురు. ముందుగవచ్చిన బిళ్లబంట్రోతులు గ్రామము మీద పడి దొరగారికి కోళ్లను, మేకలను గ్రుడ్లను సేకరించుకొనెదరు. వంగవోలునుండి మంచి బ్రాందిబుడ్లను తెప్పించి వుంచెదరు.

జనులందరు నడివీధిలో నిలుచుని దొరగారిరాకకు నిరీక్షించుచుండు సమయమున ముందుపోయిన ముదామువచ్చి దొరగారిబండి వచ్చుచున్నదని చెప్పును. అప్పుడు భజంత్రీలు మేళమును, పంచములు తప్పెటలను వాయించెదరు. భోగమువారు కాళ్లగజ్జెలతో సందడి చేసెదరు. తక్కినవారు నడుములకు గుడ్డలు చుట్టుకొని చేతులు కట్టుకొని వేచియుందురు,

దొరగారు వచ్చుపెట్టెబండిని కరణంగారు ఫర్లాంగు దూరమునచూచి గడగడ వణకుచు ఊడిపోవు గోచిని సవరించుకొనుచుండును. బట్టతలపైన నుండు గువ్వకన్ను తలగుడ్డపక్కకు జారుచుండును. కట్టుకున్న పాలచంగావి ధోవతి వూడిపోవుచుండును. రొంటిన వుండిన పొడిబుడ్డి క్రింద పడును. ఈ సమయమున దొరగారు దొరసానిగారు బండి దిగుదురు. వెంటనే వీరందరు ఆ దంపతులకు రెండు చేతులతో సలాములు పెట్టెదరు. అంత మేళతాళములతోకూడ భోగమువారితో వూరేగుతు, పాతకచ్చేరి సావడికి బసకు పోయెదరు. వెనుక నుండి వచ్చు రెండెద్దుల బండిలో పడకకుర్చీలు, స్నానము చేయుటకు తొట్టి, కక్కసుపోవు కమోడులు (మలవిసర్జన పింగాణీగిన్నెలు) మొదలగు సామానులన్నియు దిగును. కూడవచ్చిన బట్లరు (వంటవాడు) వంటకు కావలసిన సామగ్రి నంతయు సరిచూచుకొని భోజనమును తయారు చేయును. దొరిగారితో కూడవచ్చిన క్యాంపుక్లర్కు (Camp Clerk) లకు మామూళ్లను చెల్లించి, వారికి భోజనవసతికి యేర్పాటుచేయుదురు. మరునటి రోజున తెల్లవారి కాఫీపుచ్చుకొనిన పిమ్మట దొరసానితోకూడ దొరగారు తుపాకిని చేతపట్టుకొని వేటకు బైలుదేరును. మొదట వూరిలోనికిపోయి అక్కడక్కడ తిరుగుచుండిన పందులను కాల్చిచంపును. దెబ్బతగిలి క్రిందపడి కీచుకీచుమని

అరచి ప్రాణమును విడుచు పందినిచూచి ప్రక్కనున్న దొరసాని దొరగారి శూరత్వమునకు మెచ్చుకొనుచు చేతులను తట్టి సంతోషించుచుండును. చని పోయిన పందుల కామందులువచ్చి యేడ్చుచు పందులను ఈడ్చుకొని యింటికి పోవుచుండిరి. పిమ్మట యేటివడ్డున వుండిన నేరేడుతోపులోనికి పోయి చెట్ల మీద హాయిగ విహరించుచుండిన రంగురంగు పక్షులను నేల కూల్చును. క్రిందపడిన పక్షులను యేరి దొరసాని సంచిలో వేసుకొనిపోవును. ఈ వేటకు కరణం మునసబుగార్లు ముందునడుచుచు దోవ తీయుచుందురు. వేట అయిన పిమ్మట దొరగారు బసకువెళ్లి భోజనానంతరము విశ్రమించిన పిమ్మట కరిణీకపు లెఖ్ఖల తనికీ ప్రారంభమగును.

ఈ జమాబందికి చుట్టుప్రక్కలయుండు గ్రామకరణాలుకూడా లెఖ్ఖలను తీసుకుని ఈ వూరికేవచ్చెదరు గనుక ఈ లెఖ్ఖల తనికి ఈ వూరిలో కొన్ని దినములవరకు జరుగును. కలక్టరు క్యాంపు ఈ వూరిలో నుండునప్పుడు కలక్టరు సిబ్బంది వూర్లమీదపడి సంపాదించుకొనుచుండిరి. చదలవాడనుండి వచ్చిన భోగమువారుకూడ కరణాలను ఆశ్రయించుకుని యిక్కడనే యుండెదరు.

జమాబందికి వచ్చిన కరణాలందరు నా మేనమామ ములుకుట్ల మహా దేవయ్యగారింట బసచేయుచుండిరి. ఈ కరణాలందరికి వంతుప్రకారము ఆలపాటి చినవీరాస్వామిశెట్టిగారు పొత్తరలను (భోజనసామగ్రిని) పంపుచుండిరి. మనిషికి తవ్వెడు చేరుడు బియ్యమును, గిద్దెడు ముడిపెసలను, చిన్ననిమ్మ కాయంత చింతపండును, అరగిద్ద పప్పును, పిడికెడు మిరపకాయలను, చిన్న చిట్టెడు సిద్దెనెయ్యిని పంపుచుండిరి. ఊరిలోయుండు గొల్లలు ముంతెడు గొల్ల పెరుగును పంపుచుండిరి. ఈ భోజనసామగ్రితో మా అత్తగారు ముడిపెసల ముద్దపప్పును, ఇంటిలోనుండిన వంగవరుగు ధప్పళమును, చింతతొక్కు పచ్చడి తయారుచేసి భోజనమును పెట్టుచుండినది. ఆ దినమున వారింట వరి అన్నముగనుక మామగారు నన్నుకూడా భోజనమునకు పిలిచేవారు. భోజనా నంతరము కరణాలందరు వీధిపంచలో కూర్చుని ఘాటయిన పాటిపొగాకు చుట్టలను పీల్చిన పిమ్మట చెంబెడు నీళ్ళనుత్రాగి నులకమంచములపైన పరుండి గాఢనిద్ర పొయ్యేవారు. ఆకాలపు కరణాలు మంచి తిండిపుష్టిని, కండపుష్టిని కలిగిన భారీవారగుటవలన శెట్టిగారు పంపిన తవ్వెడు చేరుడు బియ్యపు అన్నము వీరికి చాలిచాలక యుండినది. వీరందరు అద్దంకి అయ్యవార్లంగారి ముద్దరను వేసుకొనిన శిష్యవర్గమునకు చేరినవారగుటవలన వైష్ణవ సాంప్రా దాయముల ననుసరించి దినచర్యను జరుపుచుండిరి. దట్టమైన తిరుమణి శ్రీ చూర్ణములను ధరించుచుండిరి. తులసిపూసల దండలను తామరపూసల దండ లను త్రిప్పుచుండిరి. చుట్లలను కాల్చుచుండిరి. నస్యమును పీల్చుచుండిరి.



# ?

"Rama was given the opportunity of safeguarding the Sacrificial Fire at Viswamitra's Ashram. He killed Tataka, finished off Subahu and threw Mareecha miles away and all that. From the royal seclusion, he was brought into the bounty of Nature and taught the skills of archery ..."

"What is it you want to know? Besides skills he was initiated into Mantras as well," said Raghu's Father.

"The efficacy of sound and will-power to transform the physical mass, - that we do not believe in. What exactly I want to know is how this sixteen-year-old boy could break Siva Dhanus while valiant princes could not even lift it?" questioned Raghu.

"Viswamitra, his revered guru, gave him that strengh. He looked at that sage for permission to approach Dhanus and the sage who brought him to Mithila only for this purpose, with a glint in his eye conveyed his consent and Rama approached the Dhanus with utmost respect and did pranam before taking it into his hands. Only with Viswamitra's soul-force Rama could accomplish the job of Siva Dhanur Bhangam. Ancient wisdom tells you that a selfless pious sage is more powerful than a ruling prince."

---

*Swadharma Swaarajya Sangha (Director: BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



పలుమారు కోర్టుల కెక్కుచు, రైతులను ఆశ్రయించి వ్యవహారములను పెంచి, పేచీలనుపెట్టి నేర్పుగ ప్రయివేటును చేయుచు పొట్ట పోసుకొనుచుండిరి.

పొరుగూర్లనుండి వచ్చిన ఈ కరణాలందరు, జమాబందిని ముగించుకొని వూర్లకు పోవునపుడు - "అబ్బాయి నీవు శెనగపప్పును కొనుక్కో" మని తలా ఒక కాణీడబ్బును నా చేతిలో పెట్టిపోవుచుండిరి. అప్పటినుండి మరల వీరు మామయ్య ఇంటికి యెప్పుడు వచ్చెదరా అని నేను వీరిరాకను యెదురు చూచుచుండెడివాడను.

నా కాపురము, కమామీషు బందరు వీధిలో యున్నప్పుడే ఎగ్మోరులో యొక స్వంత భవనమునుకొని దానిని పెద్దదిగా కట్టించి బందరువీధినుండి ఎగ్మోరుకు మారితిని. ఎగ్మోరు యింటికి పోయిన పిమ్మట మందుల వ్యాపారము యింకను వృద్ధిఅయినది. ఇంటికి సమీపమున నుండు పూనమల్లి హైరోడ్డులో నొక పెద్దభవనమును అద్దెకు తీసుకొని అక్కడ ఆఫీసును మందులు చేయు ఫాక్టరీని యుంచితిని. అక్కడనే లోధ ముద్రాలయమునుకూడ స్థాపించితిని. అక్కడనుండియే 'గృహలక్ష్మి' ప్రథమ సంచిక వెలువడినది.

# 12 అవాంతరదశ

## 'యమ్డన్ క్రూయిజర్'

మేము బందరువీధిలోనుండగా 22-9-1914 తేదిన మొదటి ప్రపంచయుద్ధములో జర్మను క్రూయిజర్ 'యమ్డన్' మద్రాసుపై ఫిరంగి గుండ్లు వదలినది. రాత్రి 9 గం॥లకు భోజనానంతరము యింటి వరండాలో యుంటిని. అకస్మాత్తుగ సముద్రములోనుండి గొప్ప వెలుతురు శబ్దమును చూచితిని. ఈ శబ్దము ఏమైనది ఎవరికి తెలియక గుంపులు గుంపులుగా సముద్రతీరము వద్దకు పరువెత్తిరి. నేనును కొంత దూరము వరకు పోయి బర్మా షెల్ ట్యాంకులు భయంకరముగ తగలబడుట చూచి వెనుకకు తిరిగితిని. 'యమ్డన్' మద్రాసుపై అకస్మాత్తుగా ఫిరంగులగాల్చి పరుగెత్తి పోయెను. 'యమ్డన్' పోయిన పిమ్మట మనవారు కోటలోనుండి సముద్రము మీద ఫిరంగీలను పేల్చిరి. ఆనాడు రాత్రి మద్రాసునుండి లక్షలకొలది జనము, దిక్కు తెలియక నలుదిక్కులకు పరుగెత్తిరి. ఇల్లు విడచి పోలేనివారు అక్కడనే వుండిపోయిరి. తెల్లవారగనే పురజనులు సముద్రము వద్దకు వెళ్ళి ప్రేలిన ఫిరంగీగుండ్ల వుక్కుముక్కలను యేరుకొనిపోయి 'యమ్డన్' జ్ఞాపకార్థము యింటిలో భద్రపరచుకొనిరి. నేనును ఒక ముక్కను తెచ్చితిని.

ఆనాటి ఫిరంగిగుండు ఒకటి హైకోర్టు ప్రహరీగోడకు - తూర్పు దిశ నున్నదానికి తగిలినది. దానివల్ల ఆ గోడ కొంత బొక్కపడినది. ఆ విశేషమును తెలుపుచు నా గోడను రిపేరు చేసినప్పుడావోట నీ క్రింది విధముగా నొక రాతిపై చెక్కించి గోడలో నమర్చియున్నారు.

> "1914 సెప్టెంబరు 22వ తేది రాత్రి జర్మన్ క్రూయిజర్ 'యమ్డన్' మద్రాసును ముట్టడించినప్పుడు ఒక గుండు ఈ ప్రహరీ గోడకు తగులగా ఈ భాగమున కొంత గోడ ఎగరిపోయినది"

జబ్బుగ యుండిన నా భార్య ఫిరంగి శబ్దములకు అదురుకొనగా స్మృతి తప్పి క్రమముగ తెలివి వచ్చెను. అప్పుడది జరిగెను. ఇటీవల జరిగిన రెండవ ప్రపంచ యుద్ధములో 1941 డిశంబరు జనవరి నెలలో జపాను ఓడలు మద్రాసుకు వచ్చుచున్నవని పుకారు కలిగినప్పుడు మద్రాసు జనమంతయు నలుదిక్కులకు పారిపోయినప్పుడు నా భార్యయు ఒంగోలుకు పోయి, మా బంధువు చివుకుల శ్రీరామశర్మగారి యింట మరణించెను.

ఆమె క్రతువులు గడిచిన పిదప కొన్నాళ్లు నేను మద్రాసులో ఉంటూ ఉండగా బర్మాలో జపానువారు విజృంభించుకొలది, సింగపూరు పడిపోయిన పిదప, జపాను సేనలు ఏనాడో మద్రాసులో దిగునన్న భీతాహము ప్రజలలో హెచ్చసాగెను. రోజు రోజును వందలు వేలు జనము మద్రాసు విడిచి ఇతర ప్రదేశములకు వెళ్లి పోజొచ్చిరి. ఏప్రిల్ 1, 2 తేదులనుండి కలకాత్తాలో బాంబులు పడినవని పట్నములో పుకార్లు రేగినవి. 3-వ తేది మా యింట మహాదేవయ్య పెండ్లి. 4, 5 - పై వార్తలింకను ప్రబలమైనవి. 6-వ తేది మధ్యాహ్నమున మద్రాసులో తీరమునకు సమీపముగా శత్రునౌకలు తిరుగుచున్నవనియు, ఎప్పుడైన దాడి జరుగవచ్చుననియు, ఈసారి ఊదబోవు హెచ్చరిక బాకా, అభ్యాసమునకుగాక, వాస్తవమే అని తలచుడనియు - ప్రభుత్వమువారు శబ్ద విస్తరణ యంత్రసాయమున నగరమంతయు చాటిరి. అందరికి 22-9-1914 నాటి అనుభవము తిరిగి స్మృతికి వచ్చెను. నేనును బంధువులను స్తళాంతరమునకు పంపుటకై రైలుకు వెళ్లియుండి, మిత్రుల బంధువుల బలమంతమున పట్నమువదలి వెళ్లితిని. ఉన్నవారు చిల్లర దొరకక, తినుటకు వస్తువులు దొరకక, హోటళ్లలో కాఫీయు దొరకక చాలా బాధపడిరట. 14, 15, 16 తేదులలో పట్నం ముప్పాతికకు పైన ఖాళీ అయినదట. పిదప క్రమముగా తిరిగీ పూటుకొన్నది. అప్పుడారునెలల పర్యంతము 'కేసరీకుటీరం' ఆఫీసును తిరుచూరుకు మార్చితిమి. అప్పుడు 'గృహలక్ష్మి' నిలిచిపోయినది. తిరిగీ వెలువడుచున్నది.

## ముగ్గురు బంధువులు

నేను ముగ్గురు పిల్లకాయలను దగ్గరదీసి పెంచి పెద్దచేసితిని. వారిలో మొదటివాడు శిష్టా శేషగిరి - నాకు దగ్గిరబంధువు. యింటర్‌ప్యాసు చేయించితిని. పిదప గవర్నమెంటు ఇండియన్ మెడికలు స్కూలులోచేరి L. I. M. డిప్లొమాను పొందెను. నా యనుభవమును బోధించితిని. క్రమముగ అన్ని కార్యములలో సమర్థత కలిగినపిమ్మట కేసరి కుటీరమునకు వైద్యుడుగను, ఆఫీసునకు మేనేజరుగను నియమించితిని. ఒంగోలు కాపురస్థుడగు శ్రీచివుకుల శ్రీరామశర్మగారి పుత్రికనిచ్చి వివాహమును చేయించితిని. వీరిని నావద్దనే యుంచుకొంటిని. నాకు కలిగిన నమ్మకము, అనురాగమువలన కేసరి కుటీరమును లిమిటెడ్ కంపెనీగా మార్చునపుడు కొన్ని షేర్లనిచ్చి కంపెనీకి డైరక్టరుగ నియమించితిని. బిడ్డలుకలిగి సంసారము పెద్దదిగానే ఎగ్మూరులో నాకువున్న యిండ్లలో ఒక యింటిని శేషగిరి పేరట చేసి, కుటుంబమును నాయింటనుండి అక్కడికి మార్చితిని.

ములుకుట్ల మహాదేవయ్య, నాబావమరిది కుమారుడేగాక నామేనమామ మనుమడు, ఆ పేరటివాడు. చిన్ననాటినుండి చదువుచెప్పించి పెంచి పెద్దచేసితిని. రావుబహదూరు కవికొండల బ్రహ్మయ్యపంతులుగారి కుమార్తెనిప్పించి పెండ్లిచేసితిని. భార్యాభర్తలకు కేసరికుటీరమున, నాయింటనే కాపురముంచితిని.

చివుకుల చెంచుపున్నయ్య - నామరదలికొడుకు, చిన్నప్పటి నుంచి నా వద్దనే పెంచితిని. ప్రస్తుతము 'గృహలక్ష్మి' పత్రికకు సంయుక్త సంపాదకుడు.

## నెల్లూరి పరిచయము

నెల్లూరిలో నాకు ముఖ్యస్నేహితులు మైదవోలు చంగయ్య పంతులు గారును, (Public Prosecutor) A. సంతానరామయ్యంగారును (V. R. H. School, Head - master), చుండూరి వెంకట క్రిష్ణయ్యగారును (Vakil), విస్సా రాజగోపాలరావుగారును ( Vakil) యుండిరి. మొదటి ముగ్గురును గతించిరి. వీర్ల స్నేహమువల్ల నేను పలుమారు నెల్లూరికి పోవుచుంటిని. నేను ప్రోగ్రసీవు యూనియన్‌లో యిప్పుడుకూడ మెంబరుగానే యున్నాను. తిక్కన జయంతి ఉత్సవాదులలో పాల్గొనుచుంటిని. దసరా ఉత్సవములలోను పాల్గొనుచుంటిని. ఆ ఉత్సవములలో ఒకరోజున నా ఉభయము. అటే చంగయ్యగారు, ఆమంచర్ల సుబ్బుకృష్ణరావుగారును ఉభయముల చేయించే

వారు. సభ్యులందరి దొకరోజు. గృహలక్ష్మి స్వర్ణకంకణ బహుమానము లను శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికిని, శ్రీమతి చిలకపాటి శీతాంబగారికిని, శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకమ్మగారికిని, శ్రీమతి కమలాదేవిగారికిని నెల్లూరి పురమందిరముననే ప్రోగ్రసీవు యూనియన్ తరపున యిచ్చితిని. మొల్లజయంతులను జరిపించి స్త్రీ రచయితలకు బహుమానముల నచ్చటనే యిచ్చితిని. నెల్లూరులో జరుగు కార్యములలోను అప్పుడప్పుడు పాల్గొను చుంటిని. నేను ఒంగోలు ప్రాంతమునకు చెందినవాడనైనను నన్ను నెల్లూరి వాసిననియే అందరు అనుకొనెదరు. నా ముఖ్య స్నేహితులలో మొదటివారగు మైదవోలు చంగయ్యపంతులుగారు మద్రాసు హిందూదేవాలయముల బోర్డుకు కమీషనరుగ మద్రాసుకురాగానే, నాకు నెల్లూరి సంబంధము చాలవరకుతగ్గినది. నెలూరిలో నాకు బంధువులు, స్నేహితులు అనేకులు యిప్పటికిని యున్నారు. కొన్నాళ్లు నేను నెల్లూరిలో నుండుటయు జరిగెను.

## నెల్లూరి విద్యార్థుల సంఘము

ఆ కాలమున మద్రాసులో నెల్లూరి విద్యార్థుల సంఘము వుండేది. ఈ సంఘమునకు చేరిన విద్యార్థులును, నెల్లూరునుండి మద్రాసుకువచ్చి ఉద్యోగము లలో యున్నవారుకలసి, ప్రతిసంవత్సరము వనభోజనముకు సమీపమునయుండు తిరువత్తూరు, విల్లివాకము, అమింజికరె, అడయారు మొదలగు స్థళములకు పోయి అక్కడ ఒక దినమంతయు గడిపి మరునాడు యిండ్లకు వచ్చుచుందుము. ఈ విద్యార్థులందరు గలసి సుమారు 150 మంది యుందురు. ఈవనభోజన మునకు విద్యార్థులందరు చందాలు వేసుకొని కూడిన డబ్బును నావద్ద తెచ్చి యిచ్చేవారు. మిగత కావలసిన డబ్బును నేను వేసి ఆ ఖర్చులన్నియు చేయు చుంటిని. పోయిన స్థళములో పిల్లకాయలు భలిగుడు యాటలు, చీట్లాటలు ఆడి భోజనానంతరము సమీపమునుండు కొన్ని చూడదగిన స్థళములకుపోయి వచ్చుచుండిరి. చెయితిరిగిన ఆంధ్రులను వంటకు తీసుకొనిపోయి మంచి తెలుగు వంటలను చేయించి పిల్లకాయలకు తృప్తిగ పెట్టుచుంటిని. ఆ విద్యార్థులలో అన్నికులముల వారుండిరి. అప్పుడు ఈసంఘమునకు గుమ్మడూరి వెంకట రంగయ్యగారు అధ్యక్షులు. వనభోజనమునకు ఆచారములు అనాచారములు ప్రత్యేకముగ భోజనమునకు వుండగూడదని నెల్లూరు కాపురస్థులగు ఏనుగు రాఘవరెడ్డిగారు పట్టుపట్టి వెంకటరంగయ్యగారి ప్రక్కననే ఆకు వేసు కొని భుజించిరి. వెంకటరంగయ్యగారు చాలా పెద్ద మనుష్యులు గనుక వారిని మన్నించి తానును భుజించిరి. ఈ కాలమున అట్టి విద్యార్థి బృందము కాన రాదు.

(ఇంకా వుంది)




## 1989 సెప్టెంబరు 8

"ప్రకృతి వనరులను దుర్వినియోగం చేయడంవల్ల చేజేతులా ఉపద్రవం తెచ్చిపెట్టుకున్న వారమవుతాము. 'ఫాసిల్ ఫ్యూయల్స్'కి (Fossil Fuels) ప్రమాణమూ, పరిమితీ ఉన్నాయి. అవి నిరంతరం లభించవు. వాటర్ టేబుల్ (Water-table) కాపాడుకోడంలో కూడా మనం తాత్కాలికో(దేకాలకులో)నై, నీటిపారుదలని దేశక్షేమ దృష్ట్యా చూడలేకుండా వున్నాము. మనం తయారుచేసే ఉత్పత్తులకంటె, ప్రకృతి ప్రసాదించే మహాసంపద ఎంతో గొప్పది. కరువు బాధ, వరద బాధ మనకు కుడిఎడమలవడం ఎంతో విచారకరం. పచ్చనిచెట్టుని నరకవద్దని ప్రాచీనులూ చెప్పారు, నవీనులూ అంటున్నారు. కొద్దిపాటి ఎలక్ట్రిసిటీ కోసం వేల సంవత్సరాలుగా ప్రాణం పోసుకున్న సైలెంట్ వాలీని ధ్వంసం చేద్దామనుకున్నారు. ఆ అనాలోచిత కార్యం ఆపేందుకు ఎంత అలజడి, ఎన్ని అభ్యర్ధనలు, 'బయొస్ఫియర్'ని (Biosphere) రక్షించుకోవాలి. కాలుష్యాల నుంచి ఎకాలజీని కాపాడాలి. పారిశుధ్యంలో చూపే అలక్ష్యమే పరిశ్రమలు వొదిలే విషవాయువులపట్లకూడా కనిపిస్తోంది. స్వలాభమేతప్ప సామూహిక శ్రేయస్సు మర్చిపోయే దుష్టత్వంనుంచి బయట పడాలి ఆధునిక పౌరుడు. "బుద్ధుడు, గాంధీజీ జన్మించిన పవిత్రభూమేనా యిది. ఆ దయాగుణం ఎక్కడికి పోయింది? - అనిపిస్తోంది ఒక్కోసారి" - స్లయిడ్స్‌తో ఉపన్యాసమిచ్చారు పద్మ విభూషణ్ డా॥ స్వామినాథన్ - భారతీయ విద్యాభవన్‌లో! వ్యవసాయ రంగంలో ప్రపంచవ్యాప్తంగా అఖండ గౌరవం పొందిన ఈ సైంటిస్ట్, మనః ప్రవృత్తిలో వినిర్మల గాంధేయవాది.

## .....09

మిత్రులు పప్పువేణుగోపాలరావు, వారి శ్రీమతి జయావేణుగోపాల్, కాలిఫోర్నియా యూనివర్సిటీనుంచి డాక్టరేట్ పొందిన సందర్భంగా, కాస్మాపాలిటన్ క్లబ్బులో డిన్నర్ యిచ్చారు. గోపాలరెడ్డిగారూ, భీమ్లీనుంచి డాక్టర్ డియన్ రావు తప్పితే, మిగతా అందరం వారం పదిరోజుల

కొకసారి ఎక్కడో ఒకచోట తటస్థపడే వారమే. అయితే, ఏదో సందర్భం వస్తే గాని, రెండుగంటలసేపు లోకవృత్తం తిరగేస్తూ, నవ్వుపువ్వులతో కాలం గడిపే వ్యవధి లభించదు.... చక్కటి ఉపన్యాసకురాలైన మిసెస్ జయకు, ఈ డాక్టరేట్ వచ్చిన సందర్భంగా మా మనః పూర్వక శుభాభినందనలు

. . . . . 11

నలభై కేంద్రాలలో నూరురోజులు ప్రదర్శింపబడిన 'సాహసమే నా ఊపిరి'కి శతదినోత్సవం వళ్లువార్ కొట్టమ్‌లో. "కృష్ణగారు, నరేష్ ఈ చిత్రంలో తమ పాత్రలను గొప్పగా పోషించారు. సాహసానికి ప్రతిరూపమే కదా కృష్ణగారు! .... 37 చిత్రాలు నిర్మించిన దర్శకురాలు, మనకు తెలిసినంతలో విజయనిర్మల ఒక్కరే. వారిద్దరూ ఎటువంటి సౌజన్యవంతులో స్నేహపాత్రులో నాకు స్వయంగా తెలుసు" - అన్నారు ముఖ్య అతిథిగా విచ్చేసిన షావుకారు జానకి. సభాధ్యక్షత వహించిన సుబ్బరామిరెడ్డి, పేరుపేరున చిత్రంలోని కళాకారులని అభినందిస్తూ, కాంగ్రెస్ సిద్ధాంతాలకు, కాంగ్రెస్ లక్ష్యాలకు తనూ కృష్ణ కట్టుబడి వున్నామనీ, విజయనిర్మల విజయ ఢంకా మోగించారనీ అన్నారు. రానున్న ఎన్నికలలో కాంగ్రెస్ విజయం తథ్యమన్నారు. కార్యక్రమ నిర్వహణ : పేకేటి శివరామ్. అభిమాన సంఘాలవారితో హాలంతా పోయింది.

. . . . . 16

ద్వివేదుల విశాలాక్షి గారిని అయిదో తేదీ సాయంత్రం ఫ్లయిట్‌లో (అమెరికాకు) ఎక్కించి, ఆరో తేదీ అంతా బిజీగా ఉండటంవల్ల, ఏడు సాయంత్రం అయిదు గంటలకి మా యింటికొచ్చినప్పుడు, 'అనుకోకుండా ముప్ఫయి ముప్ఫయ్యయిదు వేలు ఎక్కువ పెట్టేశాను' - అన్నారు డియన్ రావు. 'ఫరవాలేదండీ - దాని కంఫర్ట్ దానికుంటుంది. డిలక్స్ మోడల్ - ఎసి, యితర సదుపాయాలు - ఇమ్మీడియెట్ డెలివరీ - పిండి కొద్దీ రొట్టె కదా యివన్నీ, అని ఎక్కువ ఖర్చు పెట్టేశానేమోనని కాస్త దిగులుపడుతున్న రావుగారికి యిద్దరం ధైర్యం చెప్పాము. లక్షా నలభై వేలు కాష్ పేమెంటుతో కారు (మారుతి డీలక్స్) కొనడం, డబ్బు మూలుగుతున్న వాళ్లకి తప్ప, సామాన్యులకి కొంచెం దుడుకు గానే ఉంటుంది. పది నిముషాలు పోయాక తెప్పరిల్లిన రావు గారు 'మీరు కూడా రాకూడదూ - కబుర్లు చెప్పుకుంటూ వెళ్దాం' అన్నారు నాతో. కాఫీ తెచ్చేందుకు మాలతి లోపలికి వెళ్లింది - మేము ట్రావెల్ ప్లాన్ వేశాం. శనివారమో, ఆదివారమో పొద్దుటే ఇక్కడ నుంచి బయలు దేరడం, నెల్లూరులో రెండు గంటల సేపు. సాయంత్రానికి గుంటూరు. విజయవాడ, బందరులలో ఫ్రెండ్స్‌ని చూసుకుంటూ, ఏలూరు. తణుకు, అలమూరుల మీదుగా

రాత్రికి కాకినాడ. మర్నాడుపొద్దుట, కాకినాడలో ఫ్రెండ్స్‌తో గడిపి, లంచ్ అయాక, ఆయన అటు వైజాగ్, బీమిలీ; నేను యిటు కాకినాడ నుంచి ట్రయిన్‌లో విజయవాడ - అదీ మా ఒరిజినల్ ప్లాన్. అయితే, కారు కాగితాలు (ఆర్‌సి బుక్ వగైరా) వెంటనే చేతికందకపోవడం, రావుగారికి బీమ్లిలో ఏదో అర్జంటు పని వుండటమూ వల్ల, ఆయన ఆదివారం ఫ్లయిట్‌లో వైజాగ్ వెళ్లిపోయారు: కారు యిక్కడ షావుకారు జానకి కస్టడీలో వుంది (షావుకారు జానకి రెండో అమ్మాయి అమ్మలు, డియస్ రావు దంపతుల కోడలు - రావు గారబ్బాయి శ్రీనాథ్ దివంగతుడై పదేళ్లవుతుంది. మనుమడు సంజయ్ అమెరికాలో చదువు కుంటున్నాడు - చాలా తెలివైన కుర్రాడు; అమ్మలు కూడా స్టేట్స్‌లోనే ఉంది). రావుగారు, తన వెంట వచ్చిన మూర్తి అనే యువకుని మీద, ఈ కారు బీమ్లీ తీసుకొచ్చే బాధ్యత పెడుతూ 'కాకినాడ దాకా మీరు కూడా రాకూడదూ ?' అని అడిగారు. సరేనన్నాను గాని వెళ్లడమా మానడమా అనే సందిగ్ధంలో పడ్డాను. రావుగారితో ప్రయాణమంటే వేరు; మా కాన్వర్సేషనల్ టాపిక్స్ అనంతం; 1964లో కాబోలు సంగీతరావుగారు డియస్ రావుని మా ఇంటికి తీసుకొచ్చి 'ద్వివేదుల నరసింగ రావు' అని పరిచయం చేశారు; ఈ పాతికేళ్లలో మా మనసులు ఎంత చేరువయాయో మా మైత్రీలత ఎంత గాఢంగా పెనవేసుకు పోయిందో మాటలతో చెప్ప లేను - ఒక్క విశాలాక్షిగారికి మాత్రమే తెలుసు. .... ఇది రావుగారి కారు. వస్తానని ఆయనతో అన్నాను. నెల్లూరిలో బెజవాడ గోపాలరెడ్డిగారి 'శాంతి నికేతన్'; కాకినాడలో డా॥ భవానీ ప్రసాద్ 'చిల్డ్రన్స్ నర్సింగ్ హోమ్', మనం తప్పక చూడాలని చెప్పాను. ఆయన వెంట లేరు గనక నేను ప్రయాణం మానుకోవడం సబబా ? ఆయన మనిషి మూర్తి వున్నాడు కదా ! .... ఆర్‌సి బుక్కూ కాగితాలూ తెప్పించి, నమ్మకస్థుడైన కంపెనీ డ్రయివర్ని కుదిర్చారు షావుకారు జానకి .... శనివారం ఉదయం ఆరున్నరకి కారు వచ్చింది; మునుస్వామి చాలా అనుభవజ్ఞుడైన డ్రయివరు. పారీస్ కార్నర్‌లో టాంక్ నింపే సరికి, 92 చూపించింది స్పీడో మీటర్ - అంటే, అంతవరకు ఈ కొత్త కారు రన్ అయినది 92 కిలోమీటర్లు మాత్రమే! సిటీ లిమిట్స్ దాటాక, నేషనల్ హైవే శుభ్రంగా ఉంది. నాయుడుపేట వద్ద డైవర్షన్ తీసుకు, నెల్లూరు చేరుకొనేసరికి పదకొండు కాలేదు. గోపాలరెడ్డి గారి 'శాంతినికేతన్' లో భోంచేసి, వారి 'కోనసీమ' (గార్డెన్) చూసి, రెండు గంటలకి బయలుదేరి, చిలకలూరిపేటలో కాఫీతాగి, ఏడుగంటలకి విజయవాడ 'మమతా'కు చేరుకున్నాం. గుంటూరు వద్ద బైపాస్ రోడ్ ఘోరాతి ఘోరంగా ఉండటం వల్ల గాని



మద్రాసు కెథిడ్రల్ రోడ్‌లో గాంధీజీ బసచేసివున్నప్పుడు, జలియన్ వాలాబాగ్ దురంతాలను ఖండించే ఆయుధంగా 'హర్తాళ్' సూచించారు రాజగోపాలాచారి. ఈనాడు 'బంధ్'లు హాస్యాస్పదమయాయి. కాని, ఆనాటి 'హర్తాళ్' బ్రిటిష్ పాలకులను విభ్రమంలో ముంచింది. 'కాన్షన్స్ కీపరు'గా గాంధీగారి మెప్పు పొందిన రాజాజీ, ఆనాటి నాయకులలో అఖండ మేధావి. తన బంధువర్గాన్ని రాజకీయాలకు దూరంగా అట్టేపెట్టి, పోరాటమే ఊపిరిగా జీవించిన సోల్జర్ ఫ్రమ్ ది సౌత్

లేకపోతే ఒక గంట ముందు వచ్చి వుండేవాళ్లం: రావుగారికి ఒక విధంగా నమ్మిన బంటు వంటి మూర్తి, వినయము విజ్ఞతతో బాటు కార్య దక్షత గల బుద్ధిమంతుడు; ముందు ముందు వృద్ధిలోకి రాగల సచ్ఛీలుడు. సాహిత్యాభిరుచి, సామాజిక స్పృహ గల సదాశయుడు, సద్వర్తనుడు.

. . . . . 17

నిన్నా యివ్వాళా కూడా ఎక్కువగా ఎండలేదు. తొమ్మిది గంటలకు విజయవాడలో బయలుదేరి ఏలూరు, తణుకు, రావులపాడుల మీదుగా రెండు సార్లు గోదావరి దాటి, గతుకుల రోడ్లమీద కాకినాడ. నిన్న గుంటూరు బైపాస్ రోడ్ చేరుకొనే దాకా ఎంతో స్మూత్‌గా సాగింది ప్రయాణం: ఏలూరు రయిల్వే లెవిల్ క్రాసింగులూ, తాడేపల్లిగూడెం లారీలూ, అల మూరు ప్రాంతాల రోడ్డుగుంటలూ, యిలాటివి దాటుతున్నప్పుడు, సట్ట ణాలలో నాజూకుగా తిరగ వలసిన ఈ చిన్న కారుని ఎంత కష్టపెడు తున్నామో, దానికే గనక నోరు వుంటే మమ్మల్ని ఎంత తిట్టిపోసేదో అని పించింది .... కాకినాడ నుంచి మూర్తీ మునుస్వామి (డ్రయివర్) వైజాగ్ వైపు వెళ్లారు - నన్ను డా॥ భవానీ ప్రసాద్ వద్దదించి! ఆదివారమవడం చేత అతను యింట్లోనే ఉన్నారు. చంటిపిల్లల కోసం కట్టిన ఈ అధునా తన ఆస్పత్రి (గాయత్రీ నర్సింగ్ హూమ్) ఆధునిక వైద్య సౌకర్యా లతో యితోధిక సేవచేస్తున్నది. భవాని అతని భార్య పద్మ మాకెంతో కావల సిన వాళ్లు. మన పిల్లలు మన కళ్ల ముందు పెద్దవాళ్లయి, పదిమందికి పనికొచ్చే పని చేయ గలుగుతున్నా రంటే, అంతకు మించిన ఆనందం ఏముంటుంది? స్టేషన్ కొచ్చి, రైలు ఎక్కించి (తిరుపతి ఎక్స్‌ప్రెస్ - విజయవాడకు), రైలు కదిలాక గాని వెళ్లలేదు డాక్టర్ భవానీ ప్రసాద్. ఒక్కోసారి శేషాద్రి కూడా (భవాని మామగారు) యిటువంటి అవ్యాజాను రాగమే కురిపిస్తాడు.

. . . . . 19

నిన్న విజయవాడ, గుంటూరు.... మంగాదేవి గారింట్లో కనీసం ఒకగంట సేపైనా గడపగల ననుకున్నాను కాని ఇరవై నిముషాలకుమించి వీలుకాలేదు. ఒక్కోసారి ఈ పరుగుమీద చిరాకు పుడుతుంది. కాని, పరుగిడక తప్పదు .... 'మమతా' రూమ్‌లోని, టివి ఆన్ చేయగానే, జంధ్యాల శంకర్, హైదరాబాదు మేయరు, ఖమ్మం ఛెయిర్‌మాన్ నగరపాలిక బిల్లుగురించి జరుపుతున్న చర్చ వచ్చింది. జంధ్యాల శంకర్ వివరణ నాకెంతో నచ్చింది.... బందరునుంచి వచ్చాక ఒకగంట రెస్టు తీసుకొని, స్టేషన్‌కెళ్లి టికెట్ తీసు కొన్నాను - వోపెన్ టికెట్ రు 185. నాలుగు మూడు చోట్లకి వెళ్లి, 'మమతా' ఖాళీ చేసి స్టేషన్ చేరుకున్నాక, నిన్న మధ్యాహ్నం నుంచీ నాతో ఉన్న డ్రయివర్ వీరయ్య వద్ద వీడ్కోలు తీసుకు, ప్లాట్‌ఫారమ్ మీద టికెట్

కలెక్టరు ఆఫీసుకొచ్చి. ఏ ట్రయిన్‌లో వీలైతే దానిలో పంపమన్నాను. 'ఏ మాత్రం అవకాశం వున్నా మిమ్మల్ని హౌరా మెయిల్ ఎసి స్లీపరులో పంపుతాను' అని హామీ యిచ్చిన టీసి, తనమాట నిలబెట్టుకున్నారు - మరొక రు 58 అదనపు ఛార్జీ అయినప్పటికి .... వెలుతురు రాక పూర్వం గుమ్మం లో అడుగు పెట్టగానే 'షీబా' స్వాగతం!

. . . . . 22

"1952-53లో స్టేట్స్‌లో ఉన్న ప్పుడు 'టెంపుల్ ఫెస్టివల్' (Temple Festival) అనే నా మళయాళ కవితకు ఆంగ్లానువాదం చదివి వినిపించాను. మర్యాదకొద్దీ విన్నారు గాని వారు ఎంతమేర ఆనందించారో నాకైతే సందేహమే! 1970లో యుగో స్లావియా వెళ్లినప్పుడు 'దొంగ' అనే కవిత వినిపించాను. ఒక మహారాజా వారి కిరీటం మీదకి కప్పపిల్ల దూకు తుంది. ప్రభువులకి అది కప్పపిల్ల అని తెలుసు - తన కిరీటంలోకి దూరిందంటే దానికెంత ధైర్యం. గంట కొట్టగానే 'జీ హుజూర్' అంటూ సేవకుడు వస్తాడు : దొంగ వచ్చాడు - మహామంత్రిని పిలవ మంటాడు. 'ప్రభూ' అంటూ మహా మంత్రి వస్తాడు. 'దొంగ వచ్చాడు - సేనాధిపతిని సైన్యంతో రమ్మను' - అని హుకుమ్ జారీ చేస్తాడు. కప్ప పిల్లను చూసిన మహామంత్రి, రాజాజ్ఞ ధిక్కరించలేక, సేనాధిపతిని సైన్యంతో రప్పిస్తాడు. 'ఆ దొంగని మీ కత్తులూ కఠారులతో చంపేయండి' అని శాసి స్తాడు మహారాజు. సైనిక విజృంభణ తో కప్పపిల్లా కిరీటమూబాటు రాజు గారి శిరస్సు కూడా నేలపడుతుంది. అప్పుడా శిరస్సు, 'దొంగకు తగిన శాస్తి అయింది' అంటుంది. (అను మతి లేకుండా లోనికి ప్రవేశించే వ్యక్తికి మళయాళంలో ఒక ప్రత్యేక మైన పదం ఉంది. ఆంగ్లానువాదంలో 'థీఫ్' అన్నారు. ఇంట్లో నుంచి ఏమీ ఎత్తుకు పోక పోయినా, దొంగ తనంగా ప్రవేశించడం వల్ల దొంగ).... 1975లో అమెరికా వెళ్లినప్పుడు 'హార్స్ ప్లే' (Horse Play) అనే కవిత వినిపించాను. ఎరుపు, తెలుపు, నలుపు, గోధుమ వర్ణాలలో నాలుగు గుర్రాలు వున్నాయి. అందులో ఒక దానికి నాలుగుకాళ్లు, మరోదానికి మూడుకాళ్లు, ఇంకోటి రెండుకాళ్లు; తర్వాత ఈ నాలుగూ డాన్సు చేదామనుకున్నాయి. మొదటిరౌండు లో నాలుగుకాళ్ల గుర్రం చతికిల బడింది; ఆ తర్వాత మూడుకాళ్లది, రెండుకాళ్లది కూలబడ్డాయి; ఒంటి కాలుది మాత్రం మహదానందంతో నృత్యం సాగిస్తోంది".... మళయాళ కవి అయ్యప్ప పణికర్, మాతృకని, ఆంగ్లానువాదాన్ని, సాహిత్యఅకాడమీ వారు తమ ప్రాంతీయ కార్యాలయం లో ఏర్పాటుచేసిన లిటరరీ ఫోరమ్‌లో చదివి వినిపించారు. మాతృక చెబుతున్నప్పుడు భావయుక్తంగా, రాగయుక్తంగా పఠించారు. అయ్యప్ప

పణికర్ కవితలోని సొగసూ, సింబా లిజమ్ చెప్పుకోదగ్గవి.

## 1989 అక్టోబరు 02

"1949 అక్టోబరు రెండవ తేదీన నాగలింగ వృక్షపు నీడలో వియన్ శర్మ, ఎల్లెన్ శర్మ దంపతుల ప్రోత్సాహ సహకారాలతో, చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు ఆవరణలో అవతరించిన 'స్త్రీ సేవామందిర్' 1955 నుంచీ తనదైన స్థానమూ వరవడీ ఏర్పరుచుకుంది. అనేకానేక రంగాలలో ఇప్పుడు ముప్ఫయి శాఖలు కలిగి వుంది. కష్టంలో ఉన్న స్త్రీలని ఆదుకుంటూ, జాతి మతకుల భాషావిచక్షణ లేకుండా, తల్లీ పిల్లలని విడదీయకుండా, తల్లులకి వృత్తి విద్య, పిల్లలకి మామూలు చదువు నేర్పుతూ, డబ్బు చెల్లించే వారినీ, చెల్లించ లేని వారినీ ఒకే విధంగా చూస్తూ, ఒకే మాదిరి ఆహారం అందజేస్తున్నది. గాంధీజీ కలలను కొంతలో కొంత కార్య రూపంతో అనువదింప గలిగామనే తృప్తి మాకున్నది" – అన్నారు స్త్రీ సేవామందిర్ ఉపాధ్యక్షురాలైన మిసెస్ ఎసి కృష్ణారావు, - అశోక్‌నగర్ 'మహోదయ' లో జరిగిన 40వ వార్షికోత్సవ సందర్భంగా! వ్యవస్థాపక అధ్యక్షురాలు ఎటి సుందరమ్మ ఆహూతులకు స్వాగతం తెలిపారు.... "ఇటు కంప్యూటర్ ట్రయినింగూ, అటు ఆదరకం పనీ ఎంతో సమర్థవంతంగా సేవాధ్యేయంతో నిర్వహిస్తున్న వీరి కృషి అనన్యసామాన్యం - ఒకరోజంతా చూసినా కూడా, నేను అన్నీ కూలంకషంగా చూడ లేకపోయాను" అన్నారు, దీపారాధనగా వించి స్వామీ రాఘవేషానంద.... "ఈరోజున మన జాతి యావత్తుకు పవిత్ర దినం. మానవసేవే మాధవసేవ అని యివ్వాళ మనం కొత్తగా అనుకుంటున్నది కాదు దేశదేశాలలో భారతనారి త్యాగమూర్తిగా కీర్తింపబడుతోంది. స్త్రీ సేవా మందిర్‌కి నలభై ఏళ్ల నిండాయి - స్వర్ణోత్సవ, వజ్రోత్సవాలే కాదు - శతజయంతి కూడా జరుపుకుంటుందనటంలో ఎట్టి సందేహమూ లేదు. యల్‌కెజి సీట్లకు కూడా రికమెండేషనులూ డొనేషనులూ కావల్సిన ఈరోజులలో, చిన్న పిల్లలకి ఉచితంగా విద్యనేర్పుతామనే ఇటువంటిసంస్థ మద్రాసు మహానగరానికే గర్వకారణం"- అన్నారు తమగంభీరోపన్యాసంలో మద్రాసు ఛీఫ్‌జస్టిస్ మోహన్ .... "దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ వల్లప్రభావితులమైన వారము మేమందరం మిసెస్ కృష్ణారావు చాలా నెమ్మదస్తురాలిలా కనిపిస్తారు. కాన్మి కార్యాచరణలో ఆమె ఎంత పట్టుదల మనిషో, కార్యసాధనలో ఆమె ఎంత ఘటికురాలో దగ్గిరవాళ్లకు గాని తెలీదు. సక్సెస్‌ఫుల్ మాన్ వెనక ఒకస్త్రీ ఉన్నదని అంటారు, అలాగే ఈ సక్సెస్‌ఫుల్ వుమన్ వెనక వున్న పురుషుడు - అదిగో, ఆ ఎదురుగా కూచున్న కృష్ణారావుగారు" అన్నారు టెక్నికల్ టీచర్స్ ట్రయినింగ్ ప్రోగ్రామ్ ప్రారంభిస్తూ సరోజినీ వరదప్పన్.... కష్టంలో ఉన్నస్త్రీని,



"కళ్ళకి మసకలతో బుద్ధి వక్రీకరణతో, తీవ్రమైన అసహనంతో, మత మౌఢ్యమనేది వ్యక్తులని, జాతులని సర్వనాశనం చేసిన ఉదంతాలు ఎన్నో వున్నాయి"

—స్వామీ వివేకానంద

ఎటువంటి ప్రశ్నలూ పత్రాలూలేకుండా ఆదుకు అన్నంపెట్టే ఏకైక విస్తృత సంస్థ స్త్రీ సేవా మందిర్, మిసెస్ ఎసి కృష్ణారావు చేసిన, చేస్తున్న అద్వితీయ సేవాకృషికి స్పందించని హృదయం వుండదు.... సాయింత్రం పొట్టి శ్రీరాములు హాలులో గాంధీ జయంతి ఉత్సవం.... "లార్డ్ లిట్టన్ బ్రిటిష్ ప్రభుత్వం తరపున గాంధీగారితో సంప్రదింపులు జరిపేందుకు వార్ధా వచ్చారు - అంటే సేవాగ్రామ్‌కి. గాంధీగారు ప్రత్యేకంగా పురమాయించి ఒక కుర్చీ తెప్పించారు; ఎదురెళ్లి, అతిథి మర్యాదతోలోనికి తీసుకువచ్చి, కుర్చీ మీద ఆశీనులు గమ్మన్నారు, 'మీరు నేలమీద చతికిలబడగా. నేను కుర్చీలో ఎలా కూచుంటాను ?, నామనను అంగీకరించవద్దా ?' అని లార్డ్ లిట్టన్ ఎంతో వినయంగా బాపూజీని అడిగేసరికి, 'మీరు పంట్లాము వేసుకున్నారు - నేను అంగవస్త్రం కట్టుకున్నాను గనక నేలమీద కూచోవడం తేలిక. కాని, ట్రవుజర్స్ వేసుకున్న మిమ్మల్ని నేల మీద కూచోబెట్టడం 'హింస' అవుతుంది. నేను అహింసావాదిని' అని ముత్యాల జల్లు లాటి చెప్పారు బాపూజీ. లార్డ్ లిట్టన్ నిశ్చేష్టుడయాడు.... సర్దార్ పటేల్ నాయకత్వానగుజరాత్‌లో సత్యాగ్రహం జరుగుతోంది. కలెక్టరుగారు ట్రావెలర్స్ బంగళాలో విడిది చేసివున్నాడు. పొద్దుటే బంట్రోతుని పిలిచి క్షురకర్మ (షేవింగ్) చేసే అంబష్టుణ్ణి (మంగలి) పట్టుకురమ్మన్నాడు. బార్బరువచ్చాడు, కలెక్టరుగారి గెడ్డం గీయడం మొదలెట్టాడు. ఒకవైపు చేయడమయింది - వీధిలో పెద్ద గుంపువెళ్తోంది - 'బాయ్‌కాట్ బ్రిటిష్' అని నినాదాలు చేసుకుంటూ ! ఆ మాటలు వినడమేమిటి, బార్బరు చల్లగా జారుకున్నాడు. అద్దంలో ముఖం చూసుకున్న కలెక్టరు విస్తుపోయి, ఆ బార్బరుని ఉన్న పళంగా పట్టుకురమ్మని బంట్రోతుని తరిమాడు (అప్పటికింకా సేఫ్టీరాజరూ సెల్ఫ్ షేవింగూ వ్యాప్తిలోకి రాలేదు) 'బాయ్ కాట్ బ్రిటిష్' అన్నారు, నేనింక ఎలా వస్తాను ? - అని బంట్రోతుని ప్రశ్నించాడు బార్బరు. 'అయితే, నేను మాత్రం వెళ్తానా ?' అని ఆ బంట్రోతు బార్బరింట్లో ఉండిపోయాడు. బార్బరూ పోయాడు. బంట్రోతూ పోయాడు - వారి విషయం కనుక్కోమని కాంప్‌క్లర్క్‌ని పంపించాడు కలెక్టరుగారు. 'మీరిద్దరూ వెళ్లకపోతే నేను మాత్రం వెళ్తానా ?' అని ఆ కాంప్‌క్లర్క్, వారిద్దరితో బాటు అక్కడ వుండిపోగా, కలెక్టరుగారు దిక్కుతోచక, కారాలూ మిరియాలూ నూరుతూ, హెడ్ క్వార్టర్స్‌కి వెళ్లిపోయాడట. విజయ గర్వంతో ఈ విషయం సర్దార్ పటేల్ గాంధీగారికి విన్నవించగా, 'ఇదా మీరు చేసే నిర్వాకం ? సత్యాగ్రహం అంటే యిదా ?' అని పటేల్‌ని నాలుగు దులిపి, ఆ కలెక్టరుకి స్వదస్తూరీతో క్షమార్పణ లేఖ వ్రాశారట బాపూజీ. 1946లో లార్ అటీ వెలడించేదాకా

ఈ విషయం బయట ప్రపంచానికి తెలీదు.... ఆనాడు మేము జైలుకి వెళ్తున్నప్పుడు, మా జీవితకాలంలో స్వరాజ్యం చూస్తామనిగాని చూడ గలుగుతామని కలలో కూడా అనుకోలేదు. అహింసామూర్తి ఆదేశ ప్రకారం నడుచుకోవడమే మా కర్తవ్యం అనుకున్నాము ఆయన బోధించిన సత్యము, అహింస మార్గానందిన జీవితంలో ఆచరించేందుకు, నిరంతర సాధకుల వలె నడుచుకున్నాం. గాంధేయపథం మర్చిపోయి, తాత్కాలిక ప్రయోజనాలు ఆశించడం వల్లనే మనకీ ఇక్కట్లు సంభవిస్తున్నాయి-" అన్నారు 82 ఏళ్ల వెంగల్వరాయన్ - ప్రతి ఒక్కరి మనసూ కదిలించే వాక్సుధా ధారతో. గాంధీ ఉద్యమం తనని ఎలా ప్రభావితం చేసినదీ, వెన కటి సంగతులు గుర్తుచేసుకుంటూ చెప్పారు డా॥ విట్టూరి సత్యనారాయణ.

. . . . . 04

నిన్న రాత్రి ఎగ్మూరులో రామేశ్వరం ఎక్స్‌ప్రెస్ ఎక్కి, ఉదయం అయిదు గంటలకి తంజావూరు వచ్చాము. ప్లాట్‌ఫారమ్ మీద దిగీ దిగగానే 'కవి రాత్రి' కృష్ణమూర్తి, తనని తను పరిచయం చేసుకు, మమ్మల్ని 'తమిళనాడు హొటల్'కి తీసుకు వెళ్లారు. టూరిస్ట్ డిపార్ట్‌మెంటు వారి దవడంవల్ల అధునిక సౌకర్యాలతో పరిశుభ్రంగావుంది. "ఇంకో పది నిముషాలలో కాఫీ మీ రూమ్‌కి వస్తుంది - నాయని కృష్ణకుమారి, కొండేపూడి నిర్మల, ఇదే ఫ్లోర్‌లో ఎదురుగావున్న పదిహేడు పద్దెనిమిదిలో ఉన్నారు (మాది ముప్ఫయి ఒకటి). మేము తొమ్మిదిన్నరకి వస్తాము - రెడీగా ఉండండి" అని చెప్పి, కృష్ణమూర్తి, గణేషన్ వెళ్లిపోయారు. ఇలాటప్పుడే పక్షుల కిలాకిలా రావాలు వినడం, వెలుగు రేకలు ఎలా విచ్చుకు వచ్చేదీ చూడటం, ప్రత్యూష పవనాంకుర స్పర్శానుభూతి పొందడం .... యిత్యాదులు. మహానగర ప్రజకు రైలుప్రయాణాలలో తప్ప సూర్యోదయ, సూర్యాస్తమయాలు చూసే ఛాన్సు ఉండదు.... ఫ్లాస్కునిండా కాఫీ వచ్చింది - చదరంగావున్న సేలం స్టీలు కప్పులతో! .... బ్రేక్‌ఫాస్ట్‌కి వెళ్లినప్పుడు రెస్టారెంటులో కృష్ణకుమారి, నిర్మల కనిపించారు.... వారిద్దరూ తమ కవిత చదువుతున్నారు యివ్వాళ సెమినార్‌లో.... తొమ్మిదిం ముప్పావుకి మా యిద్దరినీ సరస్వతీ మహల్‌కి తీసుకువెళ్లారు - కారులో తమిళ రచయిత బాలకుమరన్ పరిచయమయారు.... ఈ సెమినార్‌ని సౌత్ జోన్ కల్చరల్ సెంటరు (South Zone Cultural Centre, డైరెక్టరు; షీలాప్రియ)-అగ్ని (AGNI Awakened Group for National Integration) కో-స్పాన్సర్సింగ్‌తో నిర్వహిస్తోంది.... ఉదయం సమావేశంలో సమకాలీన సాహిత్యంలో యువత చిత్రణ (YOUTH - Portrayal in Contemporary Literature) అనే అంశంపై నాలుగు దాక్షిణాత్య భాషా

లలోని ప్రముఖ రచయితలు, ఇంగ్లీషులో తమ పేపర్లు చదువుతారు. మళయాళంలో జోస్ పనాచిపురమ్ ('మళయాళ మనోరమ' న్యూస్ఎడిటర్), తెలుగులో యన్నార్ చందూర్, కన్నడలో భువనేశ్వరి హెగ్డె (మంగుళూర్ కాలేజీ లెక్చరర్), తమిళంలో మాలన్ ('ఇండియా టుడే' తమిళ ఎడిషన్‌కి కాపీ ఎడిటర్) ఆయా భాషా సారస్వతాలలోని యువతీ యువకుల పాత్రచిత్రణను సోదాహరణంగా తెలిపారు. 'అగ్ని' మేనేజింగ్ ట్రస్టీ శివశంకరి స్వాగతవచనం పలికారు. సుప్రసిద్ధ దర్శకులు బాలుమహేంద్రప్రథమ సమావేశానికి ముఖ్య అతిథి. తంజావూరు జిల్లాక లెక్టరు మచ్చేంద్రనాధన్, సెమినార్‌కి ప్రారంభోత్సవం గావిస్తూ, నేటియువత నిరాశ నిస్పృహలకు లోనుగాక, భవిష్యత్తు పట్ల కొండంత ఆశతో ముందుకి సాగాలన్నారు. బృందా జయరామన్ వక్తలను సభకు పరిచయం చేశారు.... ఒంటిగంటకు హోటల్‌కొచ్చి, భోంచేసి, ఒక అరగంట రిలాక్సయి, మళ్లీ రెండున్నరకి మధ్యాహ్నం సెషన్స్‌కి.... సరస్వతీ మహల్‌లోని నుసమలు మధ్యాహ్నానికి కొంచెం తగ్గుతాయేమోనను కున్నాము గాని, రాత్రి ఎనిమిది గంటలదాకా అవి మమ్మల్ని పల్కరిస్తూనే ఉన్నాయి.... మధ్యాహ్నానిది కథానికా సమావేశం. తంజావూరులోని తమిళ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ కందస్వామి అధ్యక్షులు. 'సుజాత'గా పాఠకులకి పరిచితులైన రంగరాజన్ ముఖ్యఅతిథి. శివశంకరి స్వాగత వచనం, బృందాజయరామన్ ఆయా కథకుల గురించిన పరిచయ వాక్యాలూ! మళయాళంలో యమ్‌టి వాసుదేవన్ నాయర్ ('మాతృభూమి' వీక్లీ ఎడిటర్) తెలుగులో మాలతీ చందూర్ (ఆంధ్రప్రభ వీక్లీ 'ప్రమదావనం' - తమిళ తెలుగు సారస్వతాల వారధి), కన్నడంలో ఎల్ దివాకర్ (నిన్న మొన్నటిదాకా 'సుధా' వీక్లీలో కళాదర్శకుడు, విమర్శకుడు) తమిళంలో సి. యోగనాధన్, బాలకుమరన్ (ఇరువురూ తమిళ సాహిత్య సీమలో సుప్రసిద్ధులు) తమ తమ కధానికలు ఆయాభాషలలో చదివారు; శివశంకరిఆ కథలలోని ముఖ్యాంశాన్ని శ్రోతలకు తమిళంలో తెలిపారు.... తంజావూరు నాయకరాజుల కాలంలో తొంభయ్యేళ్లపాటు తెలుగు యిక్కడ రాజభాష; అన్యభాషా సహనం అలవరుచుకుంటే తప్ప మనం ముందడుగు వేయలేము – అని తమిళంలో మాలతీ చందూర్ చెప్పిన విషయం మెచ్చుకుంటూ, ముందు వరుసలో నా పక్కన కూచున్నాయన 'ఆమె మీ శ్రీమతి కదా ?' అని అడిగారు. సౌత్ జోన్ కల్చరల్ సెంటరు వారి 'బ్రోషూర్'లో మా ఇద్దరి బొమ్మలూ పక్కపక్కన వేశారు. అంచేత ఆయన గుర్తుపట్టడంలో ఆశ్చర్యంలేదు. కాగా, పొద్దుటినుంచీ అంత ఓపికగా ఈ కార్యక్రమాలు ఆలకిస్తున్న ఆయన, ఆయన అంకుల్ (వయసులో పెద్దవారు) తంజావూరు నాయక రాజ

# చందా రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్ మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవ చైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడు
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యటం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్త లోకాలు
కొన్ని గ్రంథాలు
సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుభూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడోలేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
బీమలబారు

వీటిలో ఏ ఒక్కటి ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలను కున్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి

వంశానికి చెందిన నాలుగోతరం వారట. ఇంట్లో మరాఠీ, బయట తమిళం, వ్యవహార ప్రపంచంలో ఇంగ్లీషూ వారికి తెలిసిన భాషలు. 'రేపు దర్బారుహాలు (మ్యూజియమే) చూసి మరీవెళ్లండి' అన్నారాయన ఎంతో అభిమానంతో. మ్యూజియమే కాదు - ఆ మహనీయులతో కనీసం ఒక అరగంటైనా గడుపుదామను కున్నాను. వారినీ చూడలేకపోయాము; డైరక్టరు షీలాప్రియ ఆఫీసుకి వెళ్లి ఆమెకు స్వయంగా కృతజ్ఞతలూ చెప్పలేకపోయాము.... (అక్టోబరు 15 'హిందూ'లో అంజలీ సర్కార్ 'ప్రిన్స్ తులజేంద్ర భోన్స్లే' (74) ఎంత గొప్ప పెర్సనాలిటీయో వ్రాసినది చదివినప్పుడు, అతిచేరువలో ఉన్న అవకాశం చేజేతులా పోగొట్టుకున్నా మనిపించింది). అయిదున్నరా ఆరు గంటలకి వెంటనే ప్రారంభమయింది 'కవిరాత్రి'. పార్లమెంటు సభ్యులు సింగార వడివేలు ముఖ్య అతిథి; యమ్మెల్యే యబయదుల్లా ప్రారంభ కులు; ఏభాషలో చెప్పినప్పటికీ కవితకు హృదయాన్ని పరవశింపజేసే లక్షణం ఉన్నది - అన్నారు జిల్లా కలెక్టరు మచ్చేంద్రన్. సౌత్ జోన్ కల్చరల్ సెంటరు డైరక్టరు షీలా ప్రియ, ఈ కార్యక్రమ విజయానికి తోడ్పడిన అందరినీ అభినందించారు. యన్ కె దేశమ్, ఛెమ్మనమ్ ఛాకో — మళయాళంలో; నాయని కృష్ణ కుమారి, కొండేపూడి నిర్మల — తెలుగులో; యమ్మెన్ వ్యాసారావు, యన్ కె శివప్రకాష్ కన్నడంలో; అర్ రాజగోపాలన్, తమిళంబన్, అరివిముది తమిళంలో తమ కవితలు వినిపించారు.... ఎనిమిదింపావుకి సమావేశం 'జన గణ మన'తో ముగిసింది.... 'ఎ డే ఆఫ్ లిటరేచర్' (A Day of Literature) ఏం సాధిం చింది? - అనేప్రశ్న కొందరు పెసి మిస్టలకు (నిరాశవాదులు) కలగడం సహజం. దేశసమైక్యతకు, జాతిసమగ్ర తకు - నేషనల్ ఇంటిగ్రేషన్ - సాహిత్యం ద్వారా జరుపవలసిన కృషి ఎంతైనాఉంది. భవిష్యత్ భారతంలో లలితకళ, లూసాహిత్యా మూ మాత్రమే 'సిమెంటింగ్ ఫోర్స్' కాగలవు. ఆ దెసగా చేస్తున్న కృషిలో తంజావూరు వేదిక మొదటిమెట్టు మాత్రమే! సాహిత్య పరంగా జరిగిన ఈ ఐక్యతాకృషి ఒక వండర్‌ఫుల్ సక్సెస్. ఇందుకు తోడ్పడ్డవారందరూ, కష్టంలో పాలుపంచు కున్న వారందరూ అభినందనీయులు - ముఖ్యంగా షీలాప్రియ, శివశంకరి - ఈ ఇరువురి నిర్విరామకృషి ఫలితమే నేటి విజయం.

. . . . . 05

ఉదయం తొమ్మిదిన్నరకి వెహికిల్ వచ్చింది - మొట్ట మొదట త్యాగరాజ స్వామి తిరువైయార్‌కి. ప్రతీసంవ త్సరం మనం టివీలో చూసే ఆరాధ నోత్సవాలు యిక్కడే జరుగుతాయి - 1907 నుంచి ఈ సంగీతోత్సవాలు జరుగుతున్నాయి. త్యాగరాజు(1767-

1847) కృతులు ఆంధ్రసరస్వతి అమూల్య ఆభరణాలు. కాలావధులు మించిన ఆ గానామృతంలో తన్మయులు గాని వారెవ్వరు ? .... బెంగుళూరు నాగరత్నమ్మ కుమార్తె పుతలీలక్ష్మి ఈ స్మారక మందిరానికి 1925లో శంకుస్థాపన జరిపారు ; 1935 నాటికి పూర్తయింది. 'శ్రీత్యాగబ్రహ్మవారి తేజోమయ దివ్య మంగళ విగ్రహ శ్రీరామ రసాను భవము - కనులకు చలువ, చెవులకు అమృతము, రసనకు రుచి, తనువుకు ఆనందము' - ఆ మాటలు చదువుతూ మనం మరొక లోకంలోకి అడుగు పెడతాము. పాల రాతి పలకలమీద హిందీ, తమిళ, తెలుగు భాషలలో త్యాగరాయ కృతులు రాగతాళములతో సహా వ్రాయించి, గోడలకు తాపడం చేసి, పాటలోని అంశానికి శిల్పాకృతులు సమకూర్చారు. మాగంటి సూర్య నారాయణ, బెజవాడ గోపాలరెడ్డి వంటి వారిపేర్లు దాతలుగా ఆ పాల రాతి పలకల మీద చూస్తున్నప్పుడు మనసు కేదో ఆనందం కలుగుతుంది. అభయాంబికా బాలమురళీకృష్ణ ఈ స్మారక మందిరానికి మేనేజింగ్ ట్రస్టీ .... నిత్య నైవేద్యం జరిపే కాకర్ల శ్రీనివాసు (భరద్వాజగోత్రం) అనే యువకుడు త్యాగరాజు సోదరుని ముని మనుమని కుమారుడు - నాలుగో తరం. ఇంకా పెళ్ళికాలేదు - స్కూలు ఫైనలు దాకా చదువుకున్నాడు. తెలుగు మాట్లాడ గలడుగాని వ్రాయ లేడు, చదవలేడు. ఇంట్లో తెలుగే మాట్లాడుతారు ; తెలుగువారి పండ గలే (చాంద్రమాసం) పాటిస్తారు. దక్షిణాన ఇటువంటి కుటుంబాలు మనకు వేలూ లక్షలూ కనిపిస్తాయి. అక్షరాలు నేర్చుకొనే అవకాశం సదు పాయం లేకవారు నేర్చుకోరు. మమ్మల్ని 'రిసీవ్' చేసుకున్న కృష్ణ మూర్తి విషయమూ అంతే! వారిం ట్లోనూ తెలుగే మాట్లాడుతారట - కాని, చదవలేరు.... ఈ కాకర్ల శ్రీనివాస్ తన వాళ్లని వెంటబెట్టుకు, సంవత్సరానికి ఒక నెల రోజులపాటు, తన పూర్వీకులదైన ఉంఛవృత్తి (భిక్షాటన) చేస్తాడట. తెలుగు సులు వుగా నేర్చుకోగల పద్ధతులు అతనికి కొన్ని చెప్పాము.... 'ఈ సారి మీరు యిటువైపు వచ్చేసరికి నేను తెలుగు అక్షరాలు చదివి వినిపిస్తాను' — అని ఆ యువకుడు అన్నాడు. అటువంటి ఆసక్తి, ఉత్సాహమూ ఉన్నాయి నవ తరంలో. నిన్న సెమినార్‌లో మాట్లా డాము, ఇవ్వాళ యిక్కడ ఒక 'యూత్'ని చూశాము.... బృహదేశ్వ రాలయ మయాక సరస్వతీమహల్.... 15 అడుగుల ఎత్తున, చుట్టూ 15 అడుగులలోతు కందకం గల కోటలో మధ్యభాగాన ఉంది బృహ దేశ్వరాలయం. 216 అడుగుల ఎత్తు పదమూడు అంతస్తులు గల గోపురం ; పైన వుంచిన శిఖరం 80 టన్నుల నల్లటి ఏకశిల నాలుగు మైళ్ల దూరా న్నుంచి మోపులతో ఏటవాలు పద్ధతిలో పైకి ఎక్కించారట. నీడ పడట మంటూ ఎరగని ఈ కలశం

ప్రాచీన శిల్ప నైపుణ్యానికి, ఆ నాటి ఇంజనీరింగ్ స్కిల్‌కి, మచ్చుతునక. ఆర్టూ, ఇంజనీరింగూ సమ్మిళితమై చూపరులను విభ్రమంలో ముంచుతుంది ఈ బృహదాలయం. వెయ్యి సంవత్స రాల క్రితం మన దేశంలో యింత గొప్ప పనితనం ఉండేదా, ఇటువంటి అసమాన శిల్ప కళాకారులు వుండే వారా, ఏమైపోయింది ఆ ప్రజ్ఞా పాట వమూ, ప్రతిభా విశేషమూను ?- అని అనిపించక మానదు. 985 నుంచి 1012 వరకు పాలించిన ఒకటవ రాజ రాజచోళన్, 1011లో తను సింహాసన మెక్కిన 26వ సంవత్సరంలో ఈ ఆలయనిర్మాణం పూర్తి గావించాడు. నాలుగువందల మంది నాట్యకళాకారి ణులను తంజావూరు రప్పించి, వారికి భూవసతి, గృహవసతి కల్పించాడట. నాట్యకత్తెలేకాదు, సంగీతజ్ఞులకు, యితర కళాకారులకు, శిల్పులకు యిలా ఎందరికో ఆశ్రయం కల్పిం చాడు రాజరాజచోళన్. లేపాక్షి తర్వాత అంత పెద్దనంది ఉంది యిక్కడ — పన్నెండు అడుగుల ఎత్తు, పంధొమ్మిదిన్నర అడుగుల పొడవు, ఎనిమిది అడుగుల వెడల్పు. భరతనాట్య శాస్త్రంలోని 108 కరణములలో 81 ఎంతో అందంగా శిలారూపంలో పొందు పరి చారు ; మిగతా 27 పూర్తి కాలేదు. ఉత్తర దిక్కున పాశ్చాత్య దుస్తులలో ఉన్నబొమ్మ మార్కొపోలొది అనీ, నాయక రాజులకాలంలో చేర్చివుండ వచ్చుననీ అంటారు. గర్భగుడిలో 6 అ॥ల ఎత్తు 54 అ॥ ల చుట్టు కొలత గల శిలాపీఠంపై 23 అ॥ ల కైవారంతో 9 అ॥ల లింగాకృతి.... ప్రధానాలయంగాక చిన్న చిన్న గుళ్లు మరికొన్ని వున్నయి. శిల్పకళారూ పాలేగాక, రాజరాజచోళని 64 శిలా శాసనాలు కూడా వున్నాయి ఈ ప్రాంగ ణంలో ఈ ఆలయం ఎంతటి బృహదా కారంలో ఉంటుందో, అందులోని చెక్కడపు పని స్వర్ణకారుడు చేసిన బంగారు నగలంత నాజూకు. మన సాంస్కృతిక వారసత్వానికి ప్రత్యక్ష నిదర్శనమైన ఈ ఆలయ సందర్శనం ఒక మహదానుభూతి..... గ్రంథా లయం, పాత కోట, దర్బారు హాలు (మ్యూజియమ్ -ముఖ్యంగా బ్రాంజెస్) యివి చూసి హొటల్ కొచ్చేసరికి ఒకటిన్నర అయింది. నాయని కృష్ణ కుమారి రెండున్నర ట్రయిన్‌కి వెళ్తు తున్నారు - ప్రొద్దుట్నుంచీ మాతో సాయంగా మాతో ఉన్నారు.... రాత్రి తంజావూరు స్టేషన్‌లో నందకిశోర్ (డెప్యూటీ డైరక్టర్ : సౌత్ జోన్ కల్చరల్ సెంటర్) కనిపించారు ; ఏదో పనిమీద మద్రాసు వస్తున్నారు. 'నిన్నటిసెమినార్ ఎలా ఉంది ?' అని అడిగారాయన. "సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్ ట్రస్ట్ సెమినార్లకి ఏ విధంగాను తీసిపోనంత చక్కగా జరిగింది. కొన్నిటిలో వాటి కంటె కూడా బావుంది" - అంది మాలతి.

..... 10

"మా వీడియో ఛాంబర్ సభ్యత్వం 4000 - వీడియో పరిశ్రమకు చెందిన

వివిధ శాఖలవారు ఇందులో సభ్యులు. ఇది అధునాతన వైజ్ఞానిక ప్రయోగం అవడంవల్ల ఛాందసులు వ్యతిరేక భావం చూపడం సహజం. అయితే, వైజ్ఞానిక ప్రగతిని ఎవరూ ఆపలేరు. జూలైలో యిక్కడ జరిగిన 'విడియో ఎక్స్‌పో'ని (ఎగ్జిబిషన్) రెండులక్షల మంది వీక్షించారు. ఆ ప్రోత్సాహమూ, సక్సెసూ కారణంగానే, నవంబరు 29 నుంచి డిసెంబరు 3 దాకా బెంగుళూరు లోను (సంపంగి రోడ్ - వుడ్ లాండ్స్), డిసెంబరు 21 నుంచి 25 దాకా హైదరాబాదులోను (బాబుఖాన్ ఎస్టేట్) 'విడియో ఎక్స్‌పోలు' నిర్వహించదలిచాము. ఎలక్ట్రానిక్ పరిశ్రమ సుమారు ఎనిమిది వేలకోట్ల రూపాయిల పెట్టుబడిని ఆకర్షింపనున్నది. మనదేశంలోని సినిమా థియేటర్ల సంఖ్య పదివేలు; కాని, ఇరవైవేల విడియో థియేటర్లు ఉన్నాయి. ఈ టెక్నాలజీనిమనం ప్రజోపకరంగా- అజ్ఞానాన్ని, అవిద్యని రూపుమాపే సాధనంగా - పామరులకు ఎంటర్‌టైన్‌మెంటు ద్వారా ఎడ్యుకేషన్ చెప్పే మార్గంగా - మలుచుకోవాలి. దూరదర్శిని, వెండితెర చేయలేనివి విడియో చేయగలుగుతుంది". - అన్నారు సౌత్ ఇండియన్ విడియో ఛాంబర్ ఆఫ్ కామర్స్ (South Indian Video Chamber Of Commerce) అధ్యక్షులైన యస్. ఏక్‌నాథ్, సవేరాలో జరిపిన పత్రికా సమావేశంలో.

—యన్నార్ చందూర్

